శ్రీ

# తిరుమలదేవి


గ్రంథకర్త

కవిభూషణ శిష్టా వేంకటసుబ్బయ్య

హిందూ సంస్కృత పాఠశాలా ప్రధానపండితుఁడు, నరసాపురము





1943





[రు 1—4—0.

# పూర్వగాథ

శ్రీమత్కర్ణాటక సామ్రాజ్య లక్ష్మీ ధురంధరుండగు శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1509 మొదలు 1530 వఱకు నేకచ్ఛత్రాధిపత్యము వహించి యఖండవైభవంబున విజయనగరంబున రాజ్యపరిపాలనంబొనర్చెను. అన్నయగు వీరనరసింహరాయలు రాజ్యపరిపాలన చేయుచుండఁగనే రాయలు నిజభుజ పరాక్రమప్రతాపంబులు ప్రకటించి మైసూరు, కర్నూలు, మళయాళంబాదిగాఁగల దేశంబులుజయించి దక్షిణ దిగ్విజయ మొనర్చి వాసిగాంచెను. జగద్విఖ్యాతిఁగాంచిన శ్రీకృష్ణదేవ రాయల గుణగణములనుగాని ప్రతాపాదులనుగాని యిచ్చట నుగ్గడించుటకేవల మనవసరము. "ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" నాఁబడు కాళిదాసోక్తింబట్టి చక్రవర్తికి 'దాసీపుత్రు' డను కళంక మొకంటు చారిత్రాత్మకమైకూడఁ గన్పట్టి వాని గుణసందోహమున మునిఁగిపోవుచున్నది.

మహామంత్రియగు తిమ్మరుసు పేరు విననివారును వాని యసమాన మేధావిశేషసూచక విషయంబులు గాథలు గాథలుగాఁ జెప్పుకొననివారును లోకంబునందెవరును గారు. రాయల కఖండకీర్తిని గాఁబట్టి యాంధ్ర రాజ్యస్థాపనాబద్ధకంకణుఁడై తన్మనోరథసిద్ధినొందిన సిద్ధసంకల్పుఁడు తిమ్మరుసు. భారతభాగ్యము పండెనోయన వీరనరసింహ రాయ లనతికాలంబునన స్వర్గమలంకరింప నప్రయత్నముగనే తిమ్మరుసు రాయలనుసింహాసనాధిష్ఠునిఁజేసె. సాముద్రిక శాస్త్రవేత్తయగుతిమ్మరుసు నానారాజకుమారీ చిత్రఫలకంబులను దెప్పించి యందుఁ గటకపురాధీశ్వరుఁడగు వీరరుద్రగజపతి కుమార్తె తిరుమలదేవికిఁ జక్రవర్తినీలక్షణంబులు గలవని యెఱింగి యామెను కృష్ణరాయలకుఁ బరిణయ మొనర్ప నమకట్టి వర్తమానింప గజపతి మండిపడి "మాపిల్ల దాసీపుత్రుని వివాహమాడునా ? కాకికి రాజహంసి సతి కాఁగలదా ?" యని ప్రత్యుత్తరమంపెను. అందుపై రాయలు కోపఘూర్ణమానసుఁడై యుత్తర దిగ్విజయమునకుఁ బయనమయ్యెను. ఒకనాఁడు రాయలును దిమ్మరుసును విజయనగర వీథులఁ బ్రచ్ఛన్నులై పోవుచుండ నొక చాకలివాని "కొండవీడు మందేరా కొండపల్లి మందేరా..." యన్న

జాతీయగీతమునువిని శ్రుతిసేయునగు నయ్యుపశ్రుతి కెంతయు సంతసించి యా మరునాఁడే సకల సైన్యసమేతులై బయలుదేరి కొండవీడు గొట్టి దుర్గాధిపతియు వీరరుద్రగజపతి కుమారుండు నగు వీరభద్ర గజపతిని బందీగాఁగైకొని యంతటఁ గొండపల్లె, నెల్లూరు, బెజవాడ, ఏలూరు, రాజమహేంద్రవరము, పెద్దాపురము మొదలగు దుర్గంబుల ననర్గళంబుగాఁ గొల్లఁగొట్టి నవరత్నంబులుఁ బెరికెల కెత్తించి యొంటెలపై నేనుఁగులపై బలీవర్దంబులపై వేసికొనిపోయి జయాంకంబుల లిఖించెను.

ఈ దండయాత్రలధాటికిఁ గొంతసైన్యమును రస్తునమస్తమును శిథిలమగుటఁ దిమ్మరుసు వీక్షించి "యింతటితోఁ దిరిగి విజయనగరమునకుఁబోయి మరల మీఁదటికి నత్తమని నుడువు తిమ్మరుసు మాటల కడ్డువచ్చి విజయపరంపరల యహంకృతివలనను గజపతినిఁగొట్టి తిరుమలను వివాహమాడకుండ వెనుకకుంబోనను ప్రతిజ్ఞ పరిపాలింపను దిమ్మరుసు వలదన్నను రాయలు దండయాత్ర సాగించెను. కటకపుర పరిసరారణ్యంబులలోనికిఁ బోవుసరికి మాండలికప్రభువులు పదార్గురు గజపతి సామంతులు సకల సేనాసమన్వితులై రాయలసైన్యమును ముట్టడించిరి. రాయలు ససైన్యముగఁ బంచాగ్ని మధ్యంబునుండి యాలోచన పాలుపోక తిమ్మరుసు మాటవినక వచ్చి నందులకుఁ గీడు మూడెఁగదా యని విచారించుచుఁ గూర్చుండెను. ఇందనుక పూర్వగాథ.

చతురుపాయధురీణుఁడగు తిమ్మరుసు రాయల నీవిపత్తునుండి దాఁటించుటాది తిరుమలను వివాహముచేయువఱకు నుత్తరగాథలో నీనాటకము ప్రారంభమగును. ఇందుఁ దిమ్మరుసు బుద్ధికుశలతయు, నాంధ్రరాజ్యసంస్థాపన కార్యదీక్షయు, వీరశృంగారరస నిలయయగు తిరుమల యెత్తులును దిమ్మరుసు నెత్తుపైయెత్తులు మొదలగునవన్నియు వర్ణనాతీతములు. తిరుమలదేవి మహావీరరూపధారిణియై రాయచూరు యుద్ధరంగములోఁ జూపిన ప్రతాపౌన్నత్య చాకచక్యంబు లనుస్యూత జన శ్రుతి ననుసరించి యుట్టంకింపఁబడినవి. తక్కిన పెక్కు చారిత్రిక విషయములకు కీ. శే. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారి మహమ్మదీయ మహాయుగమును "Never to be forgotten Empire" ను, పెద్దన్నగారి మనుచరిత్ర మొదలగునవి యాధారములు.

# అవతారిక



చ. తిరుమలదేవి సత్కథ సుధీకుశలాత్ముఁడు భానుమూర్తి నా
కరమునఁ బెట్టి నాటకముగా రచియింపఁగఁ దగ్గవాఁడ వొ
క్కరుఁడవు నీవయంచుఁ బలుకం దొడఁగెన్ భవదీయసత్కృపా
ఝరిఁ బ్రవహింపఁజేసి యిది సత్యముసల్పఁగదమ్మ! భారతీ!

శా. తల్లీ! తిర్మలదేవి సత్కథ సుధాధారారసస్యంది ప్రో
ద్యల్లీలన్ రసగుంఫితోత్కలిక వ్రాయన్ శక్తిలేదాయె, నా
కుల్లాసంబధికంబు కూర్చ బహుభావోత్కర్షముంబూని ప
త్ఫుల్లాంభోరుహపాంసులేశము పయిన్ దొర్లింపు వాగ్దేవతా!

మ. రసభంగంబగుఁ గాదె లక్షణములన్ రక్షింప రక్షించుచో
రసముంగూర్పఁగ లక్షణమ్మునకు సంప్రాప్తించు భంగంబు త
ద్రసవిస్ఫూర్తికి లక్షణప్రతతికిన్ రానీక వైరుధ్య మో
బిసగుత్సంభవురాణి! వాణి! నను సంప్రీతిన్ విలోకింపుమా!

మ. రసమే కాదె ప్రధానమంచు విబుధవ్రాతంబు శాసించె నీ
రసకావ్యంబుల మూతిముట్టరుగదా ప్రాజ్ఞుల్ భవత్సత్కృపా
రసమున్ జిల్కెడవేని నాపయి రసప్రౌఢిన్ విరాజిల్లి పెం
పెసలారున్ గద నాదుకావ్యమిఁకఁ దల్లీ! ప్రోవు వాగ్దేవతా!



# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

పురుషులు

శ్రీకృష్ణదేవరాయలు—కర్ణాటసామ్రాజ్య చక్రవర్తి

తిమ్మరుసు—రాయలమంత్రి

గజపతిమహారాజు—కటకపురాధీశ్వరుఁడు

కొమ్మన—గజపతిమంత్రి

వీరసింహుఁడు—రాయలకు నమ్మకమైనబంటు

ఆదిల్ షా—బీజపూరు సుల్తాను

విజయుఁడు—గూఢచారి

పెద్దన, ధూర్జటి, రామలింగము, తిమ్మన, బట్టుమూర్తికవులు

చినకంబఁడు-పెదకంబఁడు-12, 14 సం॥ర॥ వయస్సుబాలురు

పురోహితులు-పుల్లావధాని-వ్యాఘ్రపుశాస్త్రి

16 గురుసేవకులు

స్త్రీలు

తిరుమలదేవి—గజపతిమహారాజు కూతురు

శ్యామల—తిరుమలచెలికత్తె

వకుళ, సరళ—వరదరాజమ్మ చెలికత్తెలు

కృష్ణవేణి—సోదెకత్తె

# తిరుమలదేవి

## కృతిప్రశంస



శ్రీరాధాహృదయాంబుజాత మదవద్భృంగీభవత్కృద్ధనుం
డారాన్నమ్రపితామహప్రముఖ దేవాంభోజ మార్తండుఁడా
నీరేజాక్షుఁడు ప్రోచుఁగాత సతమున్ శ్రేయంబులం గూర్చుచున్
రారాజన్నుతు మత్కృతీశ్వరుని వీరారెడ్డి ధీరాగ్రణిన్. 1

మ. వవులన్ దవ్వులఁ దోలుచున్ నిజవిరోధస్ఫూర్తి యొక్కుమ్మడిన్
జివురుం గైదువుజోదు తల్లియును వాక్సీమంతినీ రత్నమున్
శ్రవణార్హోరు గుణాఢ్య సత్తికుల వీరారెడ్డి ధీరాగ్రణీ
భవనక్షోణిని జిహ్వాకాంగణమునన్ వర్తింతు రశ్రాంతమున్ 2

సీ. చంద్రబింబమునందుఁ జంద్రికయై జగ
జ్జేగీయమానమై చెలఁగునెద్ది
సవితృమండలమందు సత్ప్రభారూపమై
విశ్వకల్యాణమై నెఱయు నెద్ది
లోహితాస్యునియందు దాహసంశక్తియై
యఖిలావలంబమై యలరునెద్ది
మూఁడు మూర్తులయందు మోహనాకారమై
త్రిగుణాతి భూమియై నెగడునెద్ది

గీ. దేవతామస్తకకిరీట దీప్తరత్న
రాజిత పదాంబుజాతయై ప్రబలుచున్న
యట్టి క్షీరసాగర కన్య యాదిలక్ష్మి
తాండవించుత మా రెడ్డిధామసీమ. 3

మ. చతురామ్నాయములున్ జతుర్ముఖములన్ జాతుర్యమున్ గూర్పఁగాఁ
జతురత్వంబున భారతీరమణి వాచాప్రౌఢి సంధింప సం
స్తుతిపాత్రంబుగ సృష్టిచేయు నళినీసూనుండు దీర్ఘాయువున్
బ్రతిపత్తిన్ ఘటియించి ప్రోచుతను వీరారెడ్డి ధీరాగ్రణిన్. 4

మ. మదధారాపరిధౌతకుంభయుగ శుంభద్వక్త్రనీరేజ సం
పదలన్ బన్నగభూషణాన్వితతనూభాస్వత్ప్రభాశ్రేణులన్
విదితుండై యమరేశవంద్యుండగుచున్ విఘ్నాంధకారౌఘ సం
విదరత్నాంతగభస్తిమంతుఁడగు నావిఘ్నేశ్వరున్ గొల్చెదన్. 5

గీ. ప్రాజ్ఞుఁడీతఁడు నీతఁడప్రాజ్ఞుఁడనుచు
వాక్కుచేనిర్ణయించి ధీస్వర్ణమునకు
నెసఁగు నికషోపలంబౌచు నే లతాంగి
యా లతాంగి భారతికి జోహారొనర్తు. 6

సీ. వల్మీకభవునకుఁ బ్రార్థనల్ సమకూర్చి
వ్యాసమహర్షికిఁ బ్రణుతులొసఁగి
కాళిదాసాది సత్కవులకుఁ జేమోడ్చి
నన్నపార్యునకు వందనమొనర్చి
తిక్కయజ్వకుఁ బెక్కుమ్రొక్కులు ఘటియించి
యెఱ్ఱన కేటి కోళ్ళెసఁగఁజేసి
శ్రీనాథసూరికిఁ జేతులుజోడించి
పోతనమంత్రికి జోతలిచ్చి

గీ. యల్లసానివానికి జేజె లవఘళించి
మిగులు దిగ్గజంబులకును మొగుపులిచ్చి
యాధునిక కవీంద్రులకు జోహారొనర్చి
శబ్దసంశుద్ధి కొలకుఁ బ్రశస్తభంగి.

క. సారాసార విచారణు
నారాధ్యగుణాభరణు మదభ్యుదయసదా
ధారు గురులోకగురు శ్రీ
నారాయణమూర్తి సదభినందనుఁదలఁతున్. ౮

ఉ. ఒక్కెడఁ బౌరుషానలకణౌఘముఁ గ్రక్కుచు శూరకాంత యిం
కొక్కెడ నాత్మచేష్టితసముత్కరచింతన ముగ్ధకాంత వే
ఱొక్కెడఁ బ్రౌఢకాంత మరియొక్కెడ సాహసకాంతయౌచు నిం
కొక్కెడ సాటిలేని సతియేయగు తిర్మల కావ్యకన్యకన్. 9

క. కనికాపాడుచు దానికి
ననుకూలుండైన వరుని యన్వేషణమం
దనయము మగ్నంబగు మన
మున నెటి నురియాడుచుండఁ బూనికపండన్. 10

ఉ. ధీరుఁడమాత్యవంశజుఁడు ధీవిభవాన్వితుఁడచ్ఛకీర్తివి
స్తారుఁడు ధర్మతత్పరుఁడు దాంతుఁడు దేశికసార్వభౌముఁడున్
భూరికృపాపరుండుఁ గవిపుంగవసంచయపక్షపాతి పో
మూరికులాబ్ధిచంద్రుఁడు గడుంగడు మిత్రుఁడు పుణ్యపాత్రుఁడున్. 11

ఉ. స్వాయదుదారవర్తనుఁడు భవ్యగుణుండు వివేకి భాస్వర
త్కాయుఁడు బ్రహ్మతేజము మొగంబున నుట్టిపడంగ బొల్చువాఁ
డాయతమానచిత్తుఁ డనహంకృతి యస్ఖలితుండు సత్య నా
రాయణుఁ డొక్కనాఁడు గుణరాశిని రెడ్డినిఁ దోడితెచ్చుచున్. 12

ఉ. దొడ్డ గుణమ్ములవాఁడు స్మయదూరుఁడు నీతిపథప్రవర్తి పే
ర్వడ్డ భిషగ్వరుండు హరిభక్తుఁడుఁ ద్యాగమునందుఁ జేతి కే
యడ్డును లేనివాఁడు నిఖిలార్థులపాలిటి వేల్పుగిడ్డి మా
రెడ్డినిఁబోలువారలు ధరిత్రిని లేరని యుగ్గడించుచున్. 13

క. తగినవరుం డీతఁడ యీ
సొగసగు కబ్బంపు సతికిఁ జూచుకొనుఁడనన్
నగవుసదా తళుకొత్తెడు
మొగముంగల రెడ్డిఁజూచి ముద్దియవలచెన్. 14

మ. తెలుఁగుందల్లికి ముద్దుబిడ్డ కవితాధీశుండుఁ గొప్పర్తి స
త్కుల మూర్ధన్యుఁడు భానుమూర్తిమధురోక్తుల్ చిల్కుచున్ రెడ్డికిన్
దెలిపెన్ మత్కవితాచమత్కృతులు విన్పింపంగ గ్రంథంబు లం
దలిఘట్టంబులఁగొన్నికొన్ని విని కైతన్ గూర్చి హెచ్చాడుచున్. 15

చ. కలదు ధరాతలమ్మున నఖండకవీంద్రులుఁ బండితాగ్రగ
ణ్యులును గలారుగాని యిపుడున్న కవీంద్రులయందు నిట్టి లీ
లలితపద ప్రసిద్ధి మృదులంబగు శయ్యయుఁ దియ్యమెచ్చటన్
గలుగదటంచు మెచ్చి కృతిగైకొన రెడ్డియు నిచ్చగించుచున్. 16

వ. నిక్కంపు మక్కువ నెక్కొనఁ గర్పూర తాంబూల సహితంబుగాఁ గలధౌతాంబరచయంబు లర్పించినయామహోదారుని వీరారెడ్డిని మెచ్చుకొని యిచ్చమెయిఁ గ్రహించితి నింకఁ దత్కృతీశ్వరుండగు వాని వంశావతారంబభివర్ణించెద:- 17

చ. వరనిగమాంత కాంతలకుఁ బాయని దాస్యపుటిల్లు నాకని
ర్ఝరిణికి జన్మభూమి సురరాజి కనార్తవ కల్పకంబు సు
స్థిరము ననంత మాద్య మతిసేవ్య మగమ్యమునై రహించు నా
హరిచరణాంబుజంబు గలుషాపహ మక్షయ మోక్షదంబునై. 18

క. ఆహరిచరణాంబుజమున
బాహాబలశౌర్యమునకుఁ బ్రాభవమునకున్
సాహస మాహాత్మ్యమునకు
గేహంబై రెడ్డికులము క్షితి జన్మించెన్. 19

సీ. సరసకవిచంద్రు లరుదేర వేలకు
వేలనొసఁగె ననవేమరెడ్డి
కవిసార్వభౌముల గారవించుచు నిల్చె
నాస్థాని వీరభద్రాఖ్యరెడ్డి
విద్వాంసులనుమాట విని దినవెచ్చము
లకొలంతదీర్చె మైలారురెడ్డి
బుధసంతతులకిచ్చి పోషించి భూషించె
నమలరత్నముల వీరాఖ్యరెడ్డి

గీ. రెడ్డికులమునఁ బొడమిన దొడ్డనృపులు
కృతులనందినయట్టి సుకృతులెకాని
వార్ధిపరివృతమేదినీవలయమందుఁ
బేరుఁబెంపులఁ గాంచనివారులేరు. 20

ఉ. అడ్డినవిద్విషద్విభుల నాహవరంగమునందు మొగ్గరం
బొడ్డియెదిర్చి గెల్చి ప్రతియోధశిరస్సరదస్రధారలన్
జిడ్డగువాడిఖడ్గములఁ జేవలుదేరిన బాహులొప్ప నా
రెడ్డినృపాలకోటికెదురే యితరాంధ్రధరాధిపోత్తముల్. 21

క. ఆరెడ్డి నృపతికులమున
ధీరులు పెక్కండ్రు పొడమి తేజరిలుచు న
వ్వారిగఁ జెలిరి చీలిన
వారలలోఁగరము సత్తివంశం బమరున్. 22

సీ. పరమేష్ఠిధిషణుల ప్రతివచ్చుశేముషీ
శక్తిగల్గినవారు సత్తివారు
బలికర్ణశిబిముఖ్య పార్థివేంద్రుల దాన
సమితినేలినవారు సత్తివారు.

ఇందు చందనకుంద బృందాతిశాయియౌ
సత్కీర్తిగలవారు సత్తివారు
అఖలదేశాంతర వ్యాప్త సద్వ్యాపార
సారసంపదవారు సత్తివారు

గీ. పరమ దారిద్ర్యయుతులకు భవ్యభంగి
నఖిల ధనధాన్యములనిచ్చి యబ్జభవుని
లేకివాని నొనర్చి తల్లిఖితమైన
నెత్తి వ్రాతఁ దోలఁచువారు సత్తివారు. 23

క. ఆ సత్తివంశమునఁ గవి
తాసత్తి ఘటిల్లి తర్పిత బుధుండై దా
నాసక్తుడు వేంకటరె
డ్డ్యా సంపాదితయశుం డుదారత వరలెన్. 24

ఉ. పంకరుహాయతాక్షు పదపంకజయుగ్మ నిరంతరార్చనా
లంకృత చిత్తపంకజుఁ డిలాక బుధప్రియుఁ డబ్జలోచనా
పంకజ మార్గణుండు పరిపంథిసరోరుహ చంద్రుఁ డ
వ్వేంకటరెడ్డి పొల్పెను వివేకసముద్రుఁడు వంశకర్తయై. 25

ఉ. పరిణయమయ్యె నాతఁ డతిపావన వంశచరిత్ర సత్తెమన్
తరుణి సురూపశోభిత నితాంతసతీశ్వరమానసమేత భా
స్వర గుణరత్నరోహణ రసాధరఁ జాసుకరక్షమానసుం
ధర ధర నేకిసాధరలు దా నెనవత్తురు తత్పురంధ్రికిన్. 26

చ. సకలకళాప్రవీణుఁడు విశాల హృదంబురుహుండు బంధు జా
లక సుఖదాయకుండు విమలవ్యవసాయపరుండు సత్తివం
శ కలశవార్ధిసోముఁడు ప్రశస్తగుణాఢ్యుఁడు కీర్తివల్లరుల్
సకలహరిన్మహీరుహములన్ వెలయించి రహించె నెంతయున్. 27

క. అనుగుణ దంపతులకున్
వాసింజనియించెఁ బుత్రపంచక మనఘుల్
ధీనము పేతులు విద్యా
వ్యాసంగులు రూపజితసుమాస్త్రులు ధాత్రిన్ 28

సీ. పావనాత్మకుఁడు సుబ్బారెడ్డి తొలిబిడ్డ
వెలసె వేంకటరెడ్డి మలిసుతుండు
మూడవసుతుఁడు విబుధుఁడు భూషణరెడ్డి
జగతి నాల్గవవాఁడు జగ్గిరెడ్డి
ఐదవకొమరుండు మేదినీసురభక్తి
చొప్పడఁగా నొప్పు సూరిరెడ్డి
వరహాలరెడ్డినా వరలు నామాంతరం
బరయ సుబ్బారెడ్డి యమలమతికిఁ

గీ. బుత్రపంచకము రమాకళత్రుఁడైన
విష్ణుపంచాయుధంబులో విరిలకోరి
పంచశరములొ శతమన్యుపంచతరులొ
నాఁగ విఖ్యాతిగనిరి విజ్ఞాననిధులు. 29

శా. సుబ్బారెడ్డి సహోదరప్రతతిలో శుంభత్కళాధుర్యుఁడై
తబ్బిబ్బుంబొనరించెఁ గాంచనగిరిన్ ధైర్యప్రతాపంబులన్
బ్రబ్బెన్ వాని యశస్సితాభ్రకణముల్ బ్రహ్మాండభాండంబునన్
జబ్బంజూఱ లఖండసౌఖ్యము లనుస్యూతంబు లారెడ్డికిన్. 30

మ. దురహంకారుల దుష్టకార్యపరులన్ దోషాత్ములన్ వీఁక ద
గ్గరకుం జేరఁగనీక మార్గములపైఁ గారుణ్యసంపత్తిమై
వరహాలన్ గురిపించి యెల్లెడల సుబ్బారెడ్డి ఖ్యాతిన్ గనన్
వరహాలరెడ్డియనంగఁ గాసియెడఁ దన్నామాంతరం బబ్బునే. 31

క. అతఁడు పెండిలియాడెఁ గృపావలంబ
మహితసాధ్వీత్వమున సర్వమంగళాంబ
శాంతిదాంత్యాది సర్వలక్షణకదంబ
వికచముఖజిత విధుబింబ వేంకమాంబ. 32

శా. అంకాపాంకములేని సత్యసతియై యౌదార్యగాంభీర్యముల్
లెంకల్గాఁ దనుఁ గొల్వ వల్లభుని బాళిం గొన్నయిల్లాలు ని
ర్వంకన్ జంకుఁ గళంకులేనియశముల్ రాఁబట్టె రాగిల్లుటన్
వెంకాయమ్మకు సాటిరారు రమణుల్ విశ్వక్షమామండలిన్. 33

క. చతురాస్యుని ముఖములవలెఁ
జతురంభోనిధులభంగిఁ జతురమతికిఁ ద
త్సతికిం జనియించిరి స
త్సుతులు నలువురు ధృతియుతులు సూనృతవిభవుల్. 34

క. దొడ్డగుణాఢ్యులు వేంకట
రెడ్డియుఁ జినవేంకటాఖ్యరెడ్డియు రామా
రెడ్డియు వీరారెడ్డియు
బిడ్డలు నల్వురును మివులఁ బెంపు గలారల్. 35

క. అన్నలువురిలోఁ బిన్నతఁ
డెన్నికఁగనె వీరరెడ్డి యుద్ధగుణుండై
క్రొన్ననల రాజీవము
జున్నలలోఁ జిన్నిపువ్వు జున్నంబోలెన్. 36

ఉ. శ్రీరమణాంఘ్రియుగ్మసరసీరుహమగ్నహృదంతరుండు వి
స్ఫారయశోవిశాలుఁడు రసజ్ఞశిఖామణి స్ఫాయదాంగ్లభా
షారతుఁ డాంధ్రకోవిదుఁడు సత్యవచఃపరిభూషితుండు స
త్సూరిజనానురక్తుఁడు విశుద్ధచరిత్రుఁడు స్తోత్రపాత్రుఁడున్. 37

ఉ. చారుకళాప్రపూర్ణుఁడు ప్రశస్తగుణాఢ్యుఁడు దైవభక్తివి
స్తారుఁ డుదారుఁ డూర్జితవదాన్యుఁడు మాన్యుఁడు రెడ్డిసత్తులో
ద్ధారకుఁ డార్తరక్షణవిధాననిబద్ధమనోంబుజాతుఁ డా
శారహితుండు ధీయుతుఁడు శాంతుఁడు మత్ప్రతిభర్తయెన్నఁగన్. 38

ఉ. "ఏపగువిద్యనిచ్చునెడ నీయఁడు నమ్రగుణమ్మె నమ్రతన్
జూపిన భాగ్యమీయఁ డొకచో సకలమ్మునొసంగ యోగ్యతన్
బాపు విరించి" యంచు నపవాదముపుట్టఁగ బ్రహ్మదానినిన్
మాపుకొనంగ రెడ్డిని సమస్తగుణాఢ్యునిఁగా నొనర్చెఁడే ! 39

ఉ. నాలుగువేలొసంగఁ గవినాథుఁడు దొల్లిఁట వాని మెచ్చుచున్
నాలుగువేలునున్ మరియు నాలుగువేల నొసంగినట్టి యు
ద్వేలవదాన్యమూర్తి యనవేమనృపాలుఁడు రెడ్డిగోత్రుఁడౌ
ధీలలితుండు త్యాగసముదీర్ణులు రెడ్లని పల్కనేటికిన్. 40

శా. పాతాళంబునఁ దూఱవచ్చు బలి బొబ్బల్ వెట్టి యేమీయకే
భీతిం గొల్వఁగవచ్చు మేఘుఁ డిడనా వే మాననా యంచు ఖ
ద్యోతప్రోద్భవుఁడైన ముందువెనుకల్ దూఁగాడఁగావచ్చుఁ గా
నీ తొట్రిల్లునె రెడ్డి యిచ్చునెడ క్షోణిన్ యాచకశ్రేణికిన్. 41

శా. కుష్ఠవ్యాధికి మందులేదనెడు పల్కున్ వ్యర్థముంజేసి స
న్నిష్ఠన్ మాన్నను మాన్చుచుండె నిఁక మాన్పింపంగనున్నాఁడహో
కుష్ఠవ్యాధిభయంక రాసురకులాంకూరంబు ఛేదింపఁగా
శ్రేష్ఠంబౌ నవతారమెత్తెననఁగా రెడ్డీంద్రుఁ డుర్వీస్థలిన్. 42

సీ. పలికినా మెలనవ్వు దొలకాడ మలిపల్కుఁ
బల్కఁబోవని సత్యవర్తనుండు
మెచ్చుకొం చిచ్చినా పొచ్చమింతయు లేక
వేయారులిచ్చును వితరణఖని

పట్టెనా యెట్టికావ్యంబైన నెట్టన
రసముఁ గ్రోలి యొసంగు రసికవరుఁడు
చేసెనా యొకసారి చెల్మి సజ్జనులతో
నేనాఁడు విడినాఁడఁబోని ఘనుఁడు

గీ. కవిజనమ్ములపాలిటి కల్పతరువు
సుగుణమణులకు రోహణక్షోణిధరము
సాధుశిఖులకుఁ బ్రావృట్పయోధరంబు
శ్రితపికమ్ములకు వసంతఋతువు రెడ్డి. 43

కం. క్షితిదేవోత్తమ పూజా
యతమతి నతిధృతి వినయనయాది సుగుణ సం
తతభాగ్యవతినిఁ బద్మా
వతినిఁ మత్కృతిపతి తొలిఁ బరిణయమయ్యెన్. 44

కం. చిర్లాన్వయంబున నితర
దుర్లభ సుగుణమణిసంతతుల పెన్నిధియై
గీర్లలితాంగికి నెనయై
యుర్లం దెగనాడు దీప్తి నెసఁగె ధరిత్రిన్. 45

మ. కరణవ్రాతమునందు మంత్రియు లసత్కార్యంబులన్ దాసియున్
బరమక్షాంతిని భూమిదేవియు సురూపంబందు శ్రీదేవియున్
వరసాధ్వీత్వమునందు సీత యగుచున్ బద్మావతీదేవి సు
స్థిరకల్యాణగుణప్రకాండనిధియై చెన్నారె సత్కీర్తులన్. 46

ఉ. నావను నేర్పుమైనడపు నావికుభంగి భవాబ్ధిజీవికా
నావ నజస్రమున్ నడపి నైపుణి లక్ష్మికిఁ బట్టుకొమ్మయై
దీవన మొప్ప భర్తృకపదేశపరంపర వన్నెఁబెట్టెఁ బ
ద్మావతితోడి సాటియగుదాక లుదారలు వేఱయుందురే? 47

మ. అతిథిప్రాతసమాదరమ్ము పతియుం దత్యంతసద్భక్తి సం
స్తుతిపాత్రంబగుపొత్తు న త్తరమెడల్ జుట్టాలపై రక్తియుఁ
క్షితిదేవోత్తమపూజలందు మతియుఁ దీనావనాసక్తియుఁ
బ్రతిభావృత్తియు నైజమై వెలసె నప్పద్మావతీదేవికిఁ. 48

సీ. పలుపంచలను జాలిపడని పులోమజ
చంచలత్వములేని జలధికన్య
పంకసంకలితమై పరిఢవిల్లని గంగ
సతతరోషములేని సత్యభామ
కొన్ని వేలఁజూపించుకొనని యారంజోతి
సిలుగులెఱుంగని శిబితనూజ
వనవాసకష్టంబు లనుభవింపని సీత
గురుమాటదాఁటనిగోత్రతనయ

గీ. పలుమొగంబులఁజిక్కని పలువచెలువ
విభుని నేఁడబాయకుండని భీమతనయ
తఱుఁగఁబెఱుగులులేని మార్తండుదేవి
యనఁగఁ బద్మావతీదేవి యశముగాంచె. 49

క. సుబ్బాయరెడ్డి యారసుఁ
డబ్బాళిం బుట్టినట్టియబ్జునికరణిన్
లేఁబ్రాయంబున నామెకు
సుబ్రహ్మణ్యాభుఁడగుచు సొరిది జనించెఁ 50

క. రత్నాకరమున విలస
ద్రత్నము జనియించినట్లు రాజితలీలన్
రత్నావతి పుట్టె సుగుణ
రత్ననిధియనంగ రెడ్డిరాజకులమునన్. 51

క. పద్మంబునందుఁ బొడమిన
పద్మాలయ చంద మొప్పి భవ్యగుణములన్
పద్మావతియన రోచి
స్పద్మ యనఁగఁ బిన్నదుహిత సంభవమందెన్. 52

క. అంకురముల నిజకులదీ
పాంకురముల ముగ్వురఁ గని యాత్మపతికి దుః
ఖాంకురములఁ గొల్పుచు నే
వంకయులేని ప్రియసతి దివంగతయయ్యెన్. 53

క. సురుచిరగాత్రిన్ శమసం
భరధాత్రిన్ బాపిరెడ్డిమానితపుత్రిన్
వరియించెను సావిత్రిన్
బరిణయవిధి నతఁడు సత్యవంతుండగుటన్. 54

క. వీరారెడ్డికిఁ బ్రియమగు
దారయయి సమస్తధర్మతత్పరమతియై
ధారుణి సావిత్రియనం
గా రహి వహియించి యొసఁగు నారీమణియై. 55

ఉ. మిత్రునకున్ బగల్ నెఱప మేకొనఁబోవనిఛాయయా నవో
రాత్రము భర్తృవక్త్రమున రాపిడి వెట్టనిలక్ష్మియౌను లో
కత్రయనాథు నెత్తిపయిఁ గాలిడఁబోవని గంగయౌను సా
విత్రికి ధాత్రి నెవ్వరు పవిత్రచరిత్రలు సాటివత్తురో. 56

సీ. వంచనాదూరుఁడై వట్టియమాయకుం
డగు బాపిరెడ్డి యేయతివతండ్రి
సురలందు మేటిభూసురులందు భక్తి యే
వనితామతల్లికి వాసభూమి

పతిభక్తియు సవతిసుతులందుఁ బ్రేమ యే
సుదతికిఁ బెట్టనిసొమ్ముగములు
దాసదాసీజనతానసమాదరణ మే
నాతి కే వేళ సంప్రీతికరము

గీ. అట్టిసావిత్రి తనకు భార్యగ వెలుఁగ
న్యాయశాలి పీరారెడ్డి ధీయుతుండు
శాంతసౌజన్యవాత్సల్యసంయుతుండు
పేరుపెంపుల వర్ధిల్లి వెలయుఁగాత ! 57

మ. కవితాగోష్ఠియటన్న సత్పురుషసాంగత్యంబటన్నన్ సుహృ
న్నివహాస్ఫారవినోదమన్నను రుజానిర్మూలనంబన్న దీ
నవితానావనదీక్షయన్న సరికైనన్ గూర్పు మేలన్న ని
య్యవనిన్ నిచ్చలుఁ గ్రొత్తతేనియలుసుమ్మా క్రోల మా రెడ్డికిన్. 58

మ. విలసన్నింబకదంబజంబు వటజంబీరామ్రమాలూరకా
మలకైరావతబీజపూరపనసామ్లానామ్లికాదాడిమీ
కలితానోకహసంచయమ్ములను జొక్కంబైన పద్మావతీ
నిలయారామమునందు రెడ్డి మసలున్ దేవేంద్రుచందంబునన్ 59

క. ఇటుసూర్యుండటు పొడిచినఁ
దటుకున దిగ్దంతులెల్లఁ దడఁబడినన్ బ
ల్కుట తలఁచుట చేయుట యొ
క్కటఁగానీ మాటతప్పఁగల్గునె యెందున్. 60

ఉ. శాంతికిఁ బుట్టినిల్లు నయసంపదకున్ సదనమ్ము ధీరతా
క్రాంతికి మక్కిపట్టు గుణరాశికి తావు మనీష కిక్కయై
త్యాంతికభక్తి కాకర మనంతగుణమ్ముల కాలయమ్ము శ్రీ
మంతుఁడు రాజభక్తుఁ డతిమాన్యుఁడు రెడ్డికులేంద్రుఁ డెన్నఁగన్. 61

## —• షష్ఠ్యంతములు •—

క. ఏవం విధ గుణవంతున
కావిష్కృత కీర్తి చంద్రికాసిక సుసం
భావితకకుబంతస్థ గు
ణావిసరునకు వితరణ గుణాభరణునకున్. 62

క. న్యాయసమార్జిత బహు వి
త్తా యత్తాంతః కరణున కౌదార్య గుణ
స్థాయత్కారాజ్జునకు యా
తాయాతాశ్రిత మధువ్రతౌఘాబ్జునకున్. 63

క. ధాత్రీసుర నందిత చా
రిత్ర పవిత్రునకుఁ గవివరేణ్య పికాళీ
చైత్రునకు మిత్రునకు సా
విత్రీ మహిళాస్మరునకు విమలాత్మునకున్. 64

క. వెంకాంబాసుతునకు స
ర్వంకష పృథువైద్య శాస్త్రపరిణేతకు ని
ష్పంకునకు స్వకులవార్ధి
నాంకునకు సుహృత్కుశేశయాదిత్యునకున్. 65

క. వీరారెడ్డికి మహిళాం
భోరుహ మార్గణునకుఁ గవిభూషణ కవితా
సారరసాస్వాదనునకు
ధీరాగ్రేసరునకు జలధి గభీరునకున్. 66

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన తిరుమల
దేవి నాటకంబునకుఁ బ్రారంభం బెట్టిదనిన. 67



శ్రీ

# తిరుమలదేవినాటకము

## నాంది

సిరుల నభీప్సితార్థముల సేవకకోటికొసంగి ధిక్కృతుల్
నెఱపు రిపుప్రవీరులను నిల్గఁగఁ జేయఁగ వైగు లర్థులై
శరణు చొరన్ గృపాపరత సర్వవిధంబులఁ బ్రోచు నెవ్వఁడా
తిరుమల నేలు కృష్ణుఁ డతిధీరుఁడు మిమ్ములఁ బ్రోచుఁగావుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సూత్ర:—(నేపథ్యమునంకఁ జూచి) ప్రేయసీ! నీ ముస్తాబు ముగిసినచో నొకసారి యిటు వచ్చెదవా ?

నటి:—(ప్రవేశించి) ఆర్యా! వచ్చితిని ఏమియాజ్ఞ ?

సూత్ర:—ప్రియా! పండితప్రకాండులచేత నేకాక రసగ్రహణపారీణులచేఁగూడ నలంకరింపఁబడిన దీ సదస్సు, మన మిప్పుడొక యపూర్వనాటక మభినయింపవలయును.

నటి:—ఏమినాటకము? ఎవరు రచించిరి?

సూత్ర:—చ. తిరుమలదేవినాటకము ధీనిధి వేంకటసుబ్బయాఖ్య భూ
సురకులభూషణుండు మృదునూనసమానసుధామయోక్తులన్
సరసులవీనుదోయికి రసాయనమోయనఁ గూర్చి "యాటనే
ర్పరుగలని పెట్టెఁగా మనకరంబున నెట్టులు మాటదక్కునో!

ప్రియా! మన మన్నిపాత్రలపట్లను శ్రద్ధవహింపవలయును.

నటి:—ఆర్యా ! అప్పటికప్పు డాకస్మికముగా నే ధూమశకటము నుండిరో యూడిపడి "సన్యాసిపెండ్లికి జుట్టుదగ్గరనుండి యెర" వన్నట్లు జుట్టు కట్టు బొట్టులకై వెదకికొనుచుఁ దట్టఁ దగులఁబెట్టిపోవువారికిఁ గాని సర్వసంభారములను సమగ్రముగా గూర్చిన మీకు సంకోచమేల ? వెండియు లోపరహితమైన నాటకముఁ జేపట్ట సందియమేమి ?

సూత్ర:—అట్లుగాదు. లోపము లుండుఁగాక

గీ. వస్తువున లోప మేది కన్పట్టుచున్న
మంచి యగసాలి వన్నె కల్పించునట్లు
నాటకమునందు లోపముల్ నటులుదీర్చి
వన్నె చిన్నెలఁ బెట్టరే వారిజాక్షి !

నటి:—అయిన నే నిప్పుడేమిచేయవలయునో సెలవిండు.

సూత్ర:—ఈ సభాస్థారులందఱును గాలవిలంబమున కోర్వలేక వీర శృంగారరసములు వెల్లివిరియఁజేసిన తిరుమల నాలోకించు నౌత్సుక్యమున నున్నవారు. కాన నిప్పుడే ప్రారంభమగు చున్న ఋతురాజమునుగూర్చి గానము చేయుము.

నటి:—అవశ్యమట్లే,

చ. లలితరసాలపల్లవకలంబకదంబముఁదాల్చి పుష్పలిట్
కులగుణటంకృతుల్ మొరయఁ గోమలకీరసమాజసైన్యముల్
కలకల వెంబడింపఁ గలకంఠకుహూకుహూదుందుభిధ్వనుల్
సెలఁగ వసంతయోధుఁ డవలీల జయింపఁడె కామిలోకముల్.

సూత్ర:—ప్రేయసీ ! ఎంత హాయిగాఁ బాడితివి ? ఎంత రూపవంతుఁ డైనను గుణములేనిచోఁ బ్రకాశింపనిరీతి నెంత శాస్త్రజన్య గానమైనను హాయిలేనిచోఁ బ్రకాశింపదుగదా ! నీగానమున

కీ సదస్సు మత్తు చల్లినమాడ్కి మైమఱచియున్నది. ప్రేయసీ! మన మిప్పుడేమి నాటకమాడవలయును?

నటి:—(చిరునవ్వు నవ్వి) తిరుమలదేవి యని తొలుతనే వచించితిరి గదా!

సూత్ర:—మఱచితిని, మఱచితిని. ఏల యందువా?

గీ. నాతి! నీయసమానగానంబు వలన
లాగఁబడ్డ చిత్తంబు గలాఁడనైతి
పూతమైనట్టి జాతీయ గీతిచేత
లాగఁబడిన శ్రీకృష్ణపాలకుని మాడ్కి.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.





శ్రీ

# తిరుమలదేవి నాటకము

## ప్రథమాంకము

### మొదటిరంగము

కటకపురపరిసరారణ్యము - శ్రీకృష్ణదేవరాయల గుడారము - రాయల సైనికు లానందపరవశులై జాతీయగీతములను బాడుచుందురు.

(తెరలో గానము)

"కొండవీడు మందేరా కొండపల్లి మందేరా
కాదని యెవ్వఁడు వాదుకు వచ్చిన కటకందాకా మందేరా
కోటలు పేటలు మనవేరా కోనలు సీమలు మనవేరా
కాదని యెవ్వఁడు వాదుకు వచ్చిన కన్నియకూడా మందేరా"

రాయలు:— (ఆలకించి మందహాసముచేయుచు) అదిగో! కటకము దాఁక జయించుటవలనఁగలిగిన యానందమున మునిఁగి మా సైనికులు జాతీయగీత మెంతహాయిగా గానముచేయుచున్నారు! ఈ జాతీయగీతోపశ్రుతినేకదా యాధారముగాఁ జేసికొని దండయాత్రలకు బయలుదేరి కొండవీడు కొండపల్లెలను గొల్లగొట్టి కటకముదాఁక జయించినాము. పూర్వార్ధ మర్థవంతముకాఁగా నుత్తరార్ధ మూరకపోవునా? సర్వజ్ఞుఁడగు మా యప్పాజిప్రయత్నములకు విఘ్నమనుమాట యేనాటను

లేదు. నేటికి వెనుకకుమరలి మీఁదటికి సర్వబలంబులు సమకూర్చుకొని కటకపురీదండయాత్రలకు మరలివత్తమని నొక్కి వక్కాణించిన యప్పాజిపలుకు వినక గజపతినిజయించి కీర్తి చిరస్థాయిగాఁ జేయువలయునను నాశయంబునను మహారాజ్ఞీ లక్షణంబుల విరాజిల్లు తిరుమలను బరిణయంబై కాని నగరికి మరలిరానను ప్రతిజ్ఞ పరిపాలింపను సాహసించివచ్చితి, పరమేశ్వరుఁడనుకూలించుఁగాక! (సింహగర్జనములు పులులగాండ్రింపులువినవచ్చును) ఔరా! ఈకళింగరాష్ట్రసమీపారణ్యంబులతిసాంద్రంబులై దుర్గమంబులై భయంకరంబులై యున్నవి. గజపతిరాష్ట్రమున కిప్పట్టులన్నియుఁ బెట్టనికోటలేకదా! ఇట్టి రాష్ట్రదుర్గములను జయించుట దుస్సాధమే కాని యసాధ్యములను సుసాధములుగాఁ జేయునపరబ్రహ్మమాయప్పాజియుండ నాకేమి కొఱంత? విజయనగరసామ్రాజ్యలక్ష్మిని భరించుటకు నీవే తగిన వాఁడవని నన్నుగాఢాలింగనము చేసికొని నిజకుమారుండగు నప్పరుసుకన్న మిన్నగా నెన్నుచుఁగంటిని ఱెప్పవలెఁ గాపాడుచున్నవాఁడుగదా మంత్రితిమ్మరుసు.

(విజయుఁడను వేగు వచ్చి జోహారొనర్చి నిల్చును)

కృష్ణ:—(చూచి) విజయా! సమాచారములేమి?

విజ:—ప్రభూ! గజపతిప్రాణమిత్రులు మాండలికప్రభువులు పదార్గురు పాత్రులు గజపతికొఱకుఁ బ్రాణములనైన నర్పింపనంసిద్ధులై సర్వసైన్యసమేతులై వచ్చి మన స్కంధావారములను ముట్టడింప నున్నారు.

కృష్ణ:—ఏమి? పాత్రులా! పదార్గురు నొక్కపెట్ట నెత్తివచ్చుచుండిరా! అసహాయశూరులే వారందఱును (యోజించి) భావికార్యపరిశీలనాదక్షుఁడగు నప్పాజి యిందులకే నన్ను వారించియుండ

నోపు సరే ! విజయా ! మీఁదినమాచారంబులను జాగరూక తతోఁ బరిశీలించిరమ్ము.

విజ:—చిత్తము మహాప్రభూ ! (నిష్క్రమించును)

కృష్ణ:—(తలయూచుచు) పాత్రులు ! అఖండలపాత్రుఁ డయ్యాఖండ లునికన్న పరాక్రమమున మిన్న. భయంకరపాత్రుఁడు శాస్త్రవ భయంకర పాత్రుడే ఒక్కొక్కఁ డొక్కొక్కలోకమును జయింప సమర్థుఁడే ! ఇపుడు సైన్యమా నన్నగిలిపోయె. తిమ్మ రుసా దగ్గర లేఁడాయె. ఉపశ్రుతి సగము ఫలవంతమగుటచేఁ దక్క సగము సఫలముగాకుండునా యని గర్వించివచ్చితి. ఎక్కడి యుపశ్రుతులు-ఎక్కడిఫలములు-అవి ఋషికాలపు మాటలు.

(సేవకుఁడరుదెంచి జోహారొనర్చి) రాజేంద్రా ! తిమ్మరుసయ్యవారు.

కృష్ణ:—(ఆత్రముతో) వచ్చినారా? తక్షణము లోనఁబ్రవేశపెట్టుము.

(సేవకుఁడు దారిచూపఁ దిమ్మరుసు ప్రవేశించును.)

కృష్ణ:—(ఎదురేగి తోడ్కొనివచ్చి) అప్పాజీ దయచేయుఁడు (తిమ్మ రుసును రాయలు నాసనాసీనులగుదురు.)

కృష్ణ:—అప్పాజీ !

సీ. నీమూలముననఁగదా ! వేమారు తిప్పాంబ
చంపనెంచినను జీవింపఁగంటి
నీమూలముననఁగదా ! భూమీశ్వరుఁడు గ్రుడ్డు
పెఱికించునాఁడుఁ దప్పించుకొంటి !
నీమూలముననఁగదా ! యామూలచూడంబు
నీతిశాస్త్రములెల్ల నేర్వఁగంటి
నీ మూలముననఁగదా ! నిఖిల కర్ణాట సా
మ్రాజ్య లక్ష్మీకరగ్రహముఁ గంటి !

గీ. అనఘ ! అప్పాజి ! నీమూలమునను గాదె
యనుభవములేని మముబోటి యధిపతతికి
దండపారుష్యబాధ బోధనము సేయు
చండతరమగు చపేట మొక్కుండు దింటి !

తిమ్మ:—(చిరునవ్వునవ్వి) గంభీరహృదయులును సద్గుణభూయిష్ఠులును కర్ణాటరాజ్యలక్ష్మీధురంధరులునగు మీబుద్ధి సూక్ష్మతమంబు గదా! రాజ్యలక్ష్మి మిమ్ము వరించుటకదిగదా ముఖ్యగుణము.

కృష్ణ:—అట్టిబుద్ధికౌశలతగలుగుటకును మీరలేక దా మూలము. అప్పాజీ.

సీ. చంద్రగుప్తుని రాజ్యచక్రంబుఁ ద్రిప్పిన
చాణక్యనీతినిఁ జంక్రమించి
వత్సేశు రాజ్యంబు వర్ధిల్లఁ జేసిన
యౌగంధరాయణు నవఘళించి
భోజసామ్రాజ్యంబుఁ బోషించి పెంచిన
బుద్ధిసాగరు బుద్ధి శుద్ధిఁజేసి
ప్రబల ప్రతాపుని బంధంబులూడ్చిన
మంత్రియుగంధరు మహిమఁ దెగడి

గీ. మనుమసిద్ధి నృపాలు సామ్రాజ్యలక్ష్మి
నిలుపు చేసిన తిక్కన్న తెలివి మించి
పొలుపు మీఱిన భవదీయ బుద్ధి నాకు
భోజ్య మొనరించెఁ గర్ణాట రాజ్యరమను.

అదియునుం గాక !

సీ. కరసంగతముగాక కడుబెట్టిదంబైన
యుదయాచలేంద్రంబు నొడిసిపట్టి
పరిపంథిరాజుల ప్రక్క బల్లెంబైన
కొండవీడెల్లను గొల్లగొట్టి

రాజనరేంద్ర సామ్రాజ్యలక్ష్మిని గొన్న
వేఁగిదేశంబు నువ్వెత్తుమీటి
పురుహూతమాంబకుఁ బుట్టినిల్లగు మేటి
పీఠికానగరంబుఁ బిడికిలించి

గీ. కొండపలి కోనసీమల నందఁజేర్చి
మాడుగులఁ గూర్చి యొడ్డాది నుద మడంచి
మత్తమాతంగములఁ బోలు మన్నదొరలఁ
బట్టుకొనుటెల్ల నీ బుద్ధి పటిమఁగాదె ?

తిమ్మ:—రాజేంద్రా ! నేఁడు మీపలుకు లింతవింతగా నున్న వేల ? (ముఖమును పరికించి చూచి) మీముఖవికాసమున జంకును. బలుకలయందుఁ గొంకును గన్పట్టుచున్నదే ?

చ. గజిబిజిచేసి వైరుల నఖండజయోన్నతిఁ బొల్చు మీముఖాం
బుజమున దైన్యమా! భవదపూర్వపరాక్రమవహ్ని హేతి పే
ర్చి జగములందుఁ గ్రిక్కిరిసి సింహకిశోరము స్వప్నమందు నేన్
గజపతికిన్ భయంపడఁగ గారణముండు నె? కృష్ణభూవరా !

కృష్ణ:—(తనలో) నామనోగతంబు నప్పుడే యీమతిమంతుఁడెఱింగి నట్లున్నది. (ప్రకాశముగా) బుద్ధిమంతులకు పెద్దలమాట నతిక్రమించుటచే.

తిమ్మ:—రాజచంద్రమా! అదియేల?

కృష్ణ:—ఆలోచనచాలక.

తిమ్మ:—అందువలన వచ్చినదేమి ?

కృష్ణ:—అది యిప్పుడు మీరే వెల్లడించితిరిగదా!

తిమ్మ:—ప్రభూ! మీపలుకులకు నామనం బాందోళన చెందుచున్నది. వేగ చెప్పుడు.

(విజయుఁడు ప్రవేశించి యిరువురకు జోహారొనర్చి నిలుచును.)

కృష్ణ:—అప్పాజీ! విజయుఁడు వేగ సర్వమును జెప్పఁగలఁడు. వీని రాకకై యుందనుక వేఁచియుంటి.

తిమ్మ:—విజయా! దేవరను గలంతపెట్టుసమాచారమేమి?

విజ:—ప్రభూ! పాత్రులు చుట్టుముట్టిరి. ఉన్ననన్నదారియు నరికట్ట బడినది.

తిమ్మ:—(తలయూచుచు) ఓహో! తెలిసినది! తెలిసినది! మాండ లిక ప్రభువులందఱు నెత్తివచ్చి చుట్టుముట్టిరా?

విజ:—చిత్తము! మహాప్రభూ!

తిమ్మ:—(యోజించి) విజయా! యుద్ధమెప్పుడు ప్రారంభమగునని తెలియవచ్చినది?

విజ:—ప్రభూ! మాండలిక ప్రభువులు పదాగ్గురు వ్యూహంబు పన్ని గజపతియాజ్ఞకై వేచియుండిరి. రేపే యుద్ధము ప్రారంభము కాగలదు.

తిమ్మ:—రేపే! (నిట్టూర్పువిడిచి) సరే! నీవుపొమ్ము. మాకెప్పటి సమాచారము లప్పుడు తెలియఁజేయుచుండుము.

విజ:—చిత్తము (కోహారొనర్చి నిష్క్రమించును.)

కృష్ణ:—(నిట్టూర్పువిడిచి) అవకాశమా కానరాదు. వెలుపలి సైన్యంబుల లోనికిఁగాని లోనిసైన్యంబులు వెలుపలికిఁగాని పోవుమార్గమా లేదు. అప్పాజీ! మాకిచ్చట నవమానాప జయంబులే వ్రాసిపెట్టెనా విధాత.

తిమ్మ:—రాజేంద్రా! మీకుఁ గల్గిన యవమానాపజయంబులు నాకుఁగావా?

కృష్ణ:—మీబుద్ధికుశలతయనునావచే నీవిపత్సముద్రము నుత్తరింపఁ గలనను ధైర్యంబు గలవాఁడనయ్యుఁ బెక్కుయుద్ధంబులఁ బరా క్రమంబు నెఱపి జయంబుగొన్న నాకిప్పుడేలొకో పాత్రులను దలంచినంతనే కొంతసంకోచ మంకురించుచున్నది.

తిమ్మ:—ప్రియకార్యములపట్లను విజయసూచక కార్యంబులపట్లను మహాత్ములు మిక్కిలి సందేహించుట ప్రకృతివిరుద్ధము కాఁ

జాలదుగదా! (యోజించి) ప్రభూ! అర్థసాధ్యముగా నికార్యము లెందేనిఁగలవా ? యుద్ధవీరునిచేతి ఖడ్గకాంతినంతతు లాశాంతములందుఁ దళతళలాడకుండ విల్లమ్ములు నమ్ముకొకుండ రణదుందుభుల భయంకరధ్వానములకు దిక్కులు పిక్కటిల్లకుండ లెక్కకొక్కనై నికుడై న మృత్యుముఖమునఁ బడకుండ 'ఢాం ఢాం' అను తుపాకిగుండ్లరవములు సెవులఁబడి చెవుడుపడకుండ మీాకఖండవిజయంబుఁ జేకూర్పవాఁడ. నిశ్చింతగా నుండుఁడు.

కృష్ణ:—అప్పాజీ! మీాసామర్థ్యము నెవ్వారెఱుంగరు ! ఇదే రాజముద్రిక, (అప్పాజిచేతినుంచును) మీారియిచ్చవచ్చినమచ్చునఁ బ్రవర్తించి జయంబుఁ జేకూర్పుఁడు. (నిష్క్రమించును)

(తిమ్మరుసు దీర్ఘాలోచనచేయుచుఁ దటాలునలేచి యిటునటు పచేరముచేయుచు) ఔరా ! చెప్పినమాట వినక రాయలు మహాపద తెచ్చిపెట్టినాఁడు. పరాక్రమమునకా యిది యదనుగాదు. వీరభద్ర గజపతి సామమున సాధ్యుఁడుగాఁడు. ఇక్కడింకేది వెరవు? విజయమునకేది తెరువు ? (యోజించి)

ఉ. శాత్రవవీరసంతతుల సంగరరంగమునం దెదిర్చి స
ర్వత్ర జయంబునొందఁగల బాహుపరాక్రమసంయుతుల్ గదా
పాత్రులు లంచమీాయఁ జెయిపట్టు రుపాయచతుష్టయంబునన్
ధాత్రిని భేద మొక్కఁడుగదా ! సరవాయ ముపాయ మియ్యెడన్.

ఇట్టిపట్ల దండోపాయము బ్రహ్మాండ నాయకునకైనను హాని గలిగింపకుండునా ? ఔను. భేదోపాయమే చక్కని యుపాయము. ఆ ! నాకిప్పట్టునఁ దట్టిన యీా భేదోపాయమే విజయలక్ష్మీసంపాదనకమోఘసాధనము. ఇదే ప్రయోగించెద.

ఉ. భేదముచేతఁగాదె రిపువీరవరేణ్యులఁ జీల్పవచ్చు నా
భేదముచేతఁగాదె యతివిస్తృతరాజ్యముఁ గూల్పవచ్చు సం
పాదనచేయవచ్చు బహువారిధివేష్టితరాజ్యలక్ష్మి నా
భేదముచేతఁగాదె యొకభేదముచే నదికాదు మేదినిన్.

(నిష్క్రమించును)

---

## రెండవ రంగము

కటకపురము - గజపతికోట.

(గజపతిమహారాజు, మంత్రికొమ్మనయుఁ బ్రవేశింతురు)

కొమ్మ:—రాజశేఖరా! కృష్ణరాయ ప్రతాపాగ్ని కొండవీట నుదయించి మధ్యంగత మండలేశ్వరుల మలమలమాడ్చి కటకముదాఁక వ్యాపించి యేరికినిఁ జల్లార్ప శక్యముగాకున్నది.

గజ:—అదియుంగాక రాయల ప్రతాపాగ్నికిఁ దిమ్మరుసు ప్రయుక్త రాజ్యతంత్ర ఝంఝామారుతము తోడై దిగ్దాహంబు ఘటించుచున్నది.

కొమ్మ:—అయినను నీదెబ్బతో రాయల కపజయంబుగలుగుటయే కాక వాని మానప్రాణంబులు గూడ దక్కవు.

గజ:—మన సర్వసైన్యములు సముత్సాహమున యుద్ధమునకు సిద్ధమైయున్నవా?

కొమ్మ:—రాజేంద్రా! అట్లు చీమదూరుటకైన సందులేకుండఁజేసి పరసైన్యముల నరికట్టను కోట కందకముపైఁగల లాగుడువంతెనలన్నియు నిప్పుడే తొలగింపను నాజ్ఞాపించితి. బలిష్ఠతమమైన మనదుర్గమును భేదింప నాగిరిభేదికైన వశముగాదనిన నీరాయలవశమా? అదియుంగాక పాత్రులు బలసముద్రులు. వారి ముందు రాయల ప్రతాపాగ్నిజ్వాలలుఁ జల్లారకతప్పదు.

గజ:—సచివాగ్రణీ ! పాత్రులందఱును విశ్వాసపాత్రులే కదా !
కొమ్మ:—ఏల సందియము? వారందఱును దమకై ప్రాణములనైన నర్పింప సంసిద్ధులు.
గజ:—శత్రు సైన్య రహస్యములను బలాబలములను గనుగొనిరా వేఁగులఁ బంపియుంటిరి, సచివోత్తమా ! తిమ్మరసు సామాన్యుఁడు గాఁడుసుమా!
ఉ. చీమలుప్రాఁకునప్పు డవిచేసెడి చప్పుడు కూడ నెంతయో
గోమున నాలకింపఁగల కోవిదచంద్రుఁడు తాతనేనియున్
వేమరు నూనెఁదీయఁగల నేర్పరి తిమ్మరు, సెట్టినేర్పుమై
బాము ఘటిల్లనీక జయభాగ్యముఁగూర్చెదొ మంత్రిశేఖరా!
మంత్రి:—అప్రమత్తుఁడనై సర్వత్ర మెలంగుచుంటి (నిష్క్రమించును)
గజ:—(యోజించుచు) ఇట్టియుద్ధసమయములందు ధిక్కృత కుమార పరాక్రముఁడగు నాకుమారుఁడు వీరభద్రగజపతి యెంత చేదోడువాదోడుగా నుండెడివాఁడు? కొండవీట నిద్దురాత్ముఁడగు రాయలబారిఁబడి యెంతవంతనందినాఁడోకదా? (క్రోధముతో) నేఁడురాయలసర్వసైన్యముల నీభీకరారణ్యముల మృగంబులఁ బోలెఁ జీల్చిచెండాడకూరకుందునా? విరోధికాష్ఠవీతిహోత్రులగు పాత్రులసహాయమున నేనేపనిచేయజాలను (తటాలున) ఏమిది? ఎడమకన్నదరుచున్నదే? (యోజించి) నేఁడేలొకో సుశకునంబులేమియుఁ గన్పట్టుటలేదు.
చ. ఇదివఱ కెందరోనృపుల నీల్గఁగజేసితి నేడ్తెఱఁగ మహా
కదనములందు నేఁడు జయకాంక్ష ఘటిల్లదు నాకిదేటికో
బెదరుదయించెఁ దిమ్మరుసుపేరు చెవింబడినంతమాత్రమే
యదరెడు వామపార్శ్వము మహాపద యేమిఘటిల్లనున్నదో !
(గజపతిమహారాజు వేఁగులు పెట్టెలను నెత్తినిడుకొనిపోవు రాయలసేవకులను పదార్గురను బట్టి తీసికొనివత్తురు)

గజ:—(సంభ్రమముతో) ఏమిది ? ఓరీ ! ఈసేవకులెవరు ?

వేగు:—మహారాజా ! మేము కంట వత్తిపెట్టుకొని శత్రువుల రహస్యములను గనిపెట్టుచుంటిమి. రాయలసేవకులు వీరు. మాకనుబ్రామి మనపాత్రులున్న తావునకుం బోవుచున్నారు. మమ్మునుండి తప్పించుకొనిపోవ వీరితరమా ? వీరు ద్రోహులు, ఈపెట్టెలయం దేమున్నదో పరిశీలింపుడు.

గజ:—ఆ ! అటులనా ! ఓరీ ? దొంగసేవకులారా ! ఆపెట్టెలయం దేమికలదు ? వీనినెక్కడికిం గొంపోయెదరు ?

సేవకులు:—(వణకుచు) ప...ప...పా...పాత్రుల...కడకు

గజ:—(ఆశ్చర్యముతో) ఆ! పాత్రులదగ్గరకా ! పాత్రులు ఏమి ? ఎందులకు ? ఆపెట్టెల నిక్కడఁ బెట్టుఁడు.

(సేవకులా పెట్టెల నందుంతురు)

గజ:—ఓరీ ! వీరింగొనిపోయి ముందుగాఁ గారాగారమునఁ ద్రోయుఁడు. పొండు (సేవకులు వారింగొనిపోదురు)

గజపతి వరుసగా నన్నిపెట్టెలను విప్పి బోర్లించును—మణులు—వస్త్రములు, జాబులు జలజల రాలును.

గజ:—(విభ్రమముతో నయ్యుత్తరములను జేతఁబట్టి యందొకటివిప్పి) ఈయుత్తర మేమి ? ఈవిలువవలువ లేమి ? ఈ యమూల్య రత్నసందోహ మేమి ? (లేఖ విప్పి)

శా. శ్రీకర్ణాటకభూరిరాజ్యకమలాసింహాసనాధ్యక్షుఁడౌ
స్తోకాటోపజితప్రవీరరిపుసందోహుండు శ్రీకృష్ణరా
ట్ప్రాకాంతుండు సతమ్ముఁ బాత్రుల సముద్భావించి దీవించుచున్
వీకన్ వ్రాసెడులేఖ లివ్వి వినుఁడీ ! వీనుంగవల్ విచ్చుచున్.

(సంభ్రమాశ్చర్యములతో) పాత్రులనా ! రాయలా ! దీవించుటయా ! లేఖయుంట ఇందలిసంగతులెవ్వి ?

చ. కరిపతిరాష్ట్రదుర్గములఁగల్గు నిగూఢపథప్రకాండముల్
పరమరహస్యముల్ తెలుపు పత్రికలన్నియుఁజేరె నందు మీా
రురవడిఁ గోరినట్టిమణు లొప్పఘటిల్లు దుకూలసంతతుల్
వెరవునఁ బంపినాము కని వెంటన తెల్పుఁడు చేరినట్లుగన్.

(ఆత్రముతో) కరిపతి రాష్ట్రమును దుర్గమునా! ఔనౌను గజపతి దుర్గమన్నమాట కాదాయిది గడునుప్రాతలు. పాత్రులు దుర్గరహస్యముల నన్నింటినిఁ గృష్ణరాయలకు వ్రాసినారఁట. విశ్వాసపాత్రులగు పాత్రులట్లొనర్తురాఏమి? (మరలఁజదువుట నభినయించి) పరమరహస్యవిషయములు జాగ్రత్తగాఁజేరినవఁట! ఔరా! ఇతః పూర్వమునుండియు వీరిరువురకు నేవియో రాయబారములు జరుగుచుండియుండవలయు అకటా! నేనుభ్రమించుచుంటినా! తప్పుచదువుచుంటినా (మరియొకసారి జాబుగ్రహించి తప్పకచూచుచు) పాత్రులు కోరినవిూరఁటఁ బంపిన మణులును జీనిచీనాంబరములునా యివి?

చ. పదపడి పోరుసల్పుటకు వచ్చినయట్టులెవచ్చి రేపు త
త్కదనతలంబునం దొకవిధంబుగ యుద్ధముఁజేసిచేసి య
య్యదను గ్రహించి మీాన్నృపతి నంతట మాకును బట్టియిత్తు మం
చు దయ దలిర్ప వ్రాసినది చూచితి మెంతయు మెచ్చువచ్చెడిన్.

(అన్నియుత్తరములను బరిశీలించి) యుద్ధము - యుద్ధము సేయునట్లు నటించి పాత్రులు రేపు నన్ను రాయలకుఁ బట్టియిచ్చెదరఁట! నిజమా? చిత్రమా! స్వాప్నమును గోలోప్పకుము. నిజము! నిజము! ఈయమూల్యరత్నములే దీనికిఁ బ్రబలప్రమాణము. ఈవిలువవలువలే మేటిసాక్ష్యము. ఈవ్రాతయే నాపాలిటి యమదూత! ఈమణులన్నియు నన్నెయాకర్షించి వ్యామోహపఱచుచుండ నన్నుపజీవించు పాత్రుల నాకర్షింపకుండునా? ఈ పేటిక లిప్పుడు కంటఁబడకున్న రేపీపాటికి గజపతి పేరుప్రతిష్ఠలు గజపతివంశ మంతరించియుండెడి వేమో

కదా ! ఔరా ! లోకమునం దెంతనమ్మకముగల మిత్రులనుగొను వారినైనను నమ్మరాదు. నమ్మరాదు !

ఉ. మిత్రులరీతిఁగన్పడుచు మేకులు చెక్కుచునుంద్రు లోన నీ
మిత్రులు నామమాత్రులెనుమీ ! సుఖదుఃఖములందు రెండిటన్
ధాత్రినిఁబాలుపంచుకొను ధన్యులుమాత్ర సుమిత్రులౌదు రీ
పాత్రులు మిత్రులౌదురె ? యపాత్రులు శత్రులు నాదుపాలికిన్.

అక్కటా! ఈగండముగడచి గట్టెక్కినఁగదా యోజింపవలయు. ఈస్వామిద్రోహులగు పాత్రులను శిక్షింపకూరకుందునా ? ఏమి ? నా వెఱ్ఱి ! నేను జీవించినఁగదా యోజింపవలయు. పాత్రులవలె దుర్గంబునందు మిత్రులరీతి సంచరించుచునింక నెందరెందరు నన్ను వంచింపనుండిరోకదా ! నేనిప్పు డీదుర్గంబున నుంట క్షేమకరంబుగాదు. ఈ రాత్రియే యెరికిం దెలియరాకుండఁ గోటదాఁటిపోయి నమ్మికగల సామంతులఁ జేకూర్చుకొని వైరివీరనిర్మూలనం బొనర్పయత్నించెద. నాయాజ్ఞ లేనిదే విద్రోహులగు పాత్రులు యుద్ధ మొనర్ప లేరుగదా ! ఆర్చిచచ్చినను బలిష్ఠమగునీకోట రాయల స్వాధీన మెన్నటికినిఁ గాఁజాలదు. (తలయూచి) ఔను ! ఉత్తరఖండవాసులగు పాత్రులకును రాయలకు నుత్తరప్రత్యుత్తరములేమియు జరుగకుండుట నిశ్చయమే. వారల కెగఁబోసి సైన్యములఁ జేకూర్చుకొని వచ్చి రాయలపైఁ గసి తీర్చుకొందుఁగాక. ఔరా !

గీ. కొసకు నమ్మించి పాత్రులు గొంతుఁగోసి
రేమిచేయుటకును దోచ దిట్టివేళ
రాయలనుగూల్ప నెంచు శాత్రవులఁ జేర్చి
తేకుమడఁచెదఁగాక యీ తేఁపపొగరు.

(నిష్క్రమించును)

---



శ్రీ

# తిరుమలదేవి నాటకము

## ద్వితీయాంకము

(ఫుల్లావధాని - వ్యాఘ్రప్పశాస్త్రి - ఇరువురు బ్రాహ్మణులు ప్రవేశింతురు)

ఫుల్లా:—ఒయ్యోయి బావా! ఎక్కడికేమిటి అంతహడావిడిగా వెడుతున్నావు?

వ్యాఘ్రప్ప:—ఉండు! ఉండు! వస్తావుకు. ప్ర ప్ర ప్రతిష్ఠ.

ఫుల్లా:—ఏం ప్రతిష్ఠోయి.

వ్యాఘ్రప్ప:—స్ - స్తంభ ప్రతిష్ఠ.

ఫుల్లా:—ఎక్కడ ఎక్కడ?

వ్యాఘ్రప్ప:—అదుగో అల్లాచూడు. మనవాళ్ళొకరి నొకరు తోసుకుంచూ యెల్లా వెడుతున్నారో, త్వరగా వెళ్ళాలి నేను. వస్తేరా.

ఫుల్లా:—(నవ్వి) నీ మొఖంలాగే ఉంది. అక్కడ గుడిలేదు. గోపురం లేదు. ఎక్కడి ధ్వజస్తంభ ప్రతిష్ఠరాయిది. సంభావన దీనికి తగినట్లే ఉంటుంది. అష్లాయితే.

వ్యాఘ్రప్ప:—ఓరి యెఱ్ఱి మొకమా! ధ్వజస్తంభప్రతిష్ఠకాదురా అది. విజయస్తంభ ప్రతిష్ఠ.

ఫుల్లా:—ఓహో! మనరాజుగారికి విజయం కలిగిందన్నమాట్లా అల్లాయితే మనకి కావలసినన్ని బహుమతులివాళ.

వ్యాఘ్రప్ప:—ఆ! మనరాజుగారికి అప్రతిష్ఠ. శ్రీకృష్ణదేవరాయల వారి విజయ స్తంభ ప్రతిష్ఠ. మనవారికి కావలసినన్ని చీవాట్లు. వారి వారికి క్రొత్త క్రొత్త బహుమతులు. వారివారికేమిటి. మన కూడాను, ఇవాళ బ్రాహ్మలికి సంభావనలేమిటో తెలుసునా కొండపల్లి మొదలింతవఱకు రాయలు పట్టిన కోటలలోని వజ్రాలు వైడూర్యాలు గోమేధికాలు పుష్యరాగాలు ఒక టేమిటి అన్నీ సంచీలలో పోయించి ఒంటెలమీద ఏనుగుల మీద వేయించుకొని వచ్చారు.

పుల్లా:—నీ తెలివికాలా అవి నీకూ నాకూయివ్వడానికట్రా

వ్యాఘ్రప్ప:—అఘోరించావులే ఊరుకోమరి రాయలవారి అవల్దారు కుంచం పుచ్చుకొని వెడుతూంటే చూశానులే నేను. వారకు కూడా చేశాను. ఒక్కొక్క బ్రాహ్మడికి అందులో మనబోటి శ్రోత్రియబ్రాహ్మడికి కుంచెడేసి మంచిముత్యాలిస్తారట.

పుల్లా:—అయ్యో ! మన రాజున కెంత అప్రతిష్ఠవచ్చిందిరా.

వ్యాఘ్రప్ప:—అదలల్లాఉంచు. అంతకంటె ఎక్కువ అప్రతిష్ఠరావ కార్యం యింకోటుందిమరి. గజపతిమహారాజుగారు కోటలో కనిపించడంలేదట విన్నావూ. కోటంతా అల్లకల్లోలంగాఉంది. ఎంతో ఆర్భాటంతో ముట్టడింప వచ్చిన పాత్రులు రాజుగారి పలాయనం సంగతి విని రాజులేని యుద్ధంలేదుకదా అని వెళ్లిపోయారు. వలవేసి వెతుకుతున్నారు రాజుగారిజాడాలేదు జబాబూలేదు.

పుల్లా:—ఏమైపోయాడురామరి.

వ్యాఘ్రప్ప:—రాయలప్రతాప పరాక్రమాలువిని హడలి ఆకాశం అంటాడు.

పుల్లా:—మహాపరాక్రమశాలి కొండవీడువలఅకు నాంధ్రరాజ్యమును జయించి నిరంకుశుడై పరిపాలించిన క్షత్రియవీరుడు వీరరుద్రగజపతియంతవాడు కాళ్లకి బుద్ధిచెపుతాడా. అందులో బలేయెత్తులెఱిగిన ప్రభువుకదా

వ్యాఘ్రపు:—ఆపదవచ్చి అమాంతముగా పెద్దపులిలా మీదపడుతూంటే చూస్తూ ఊరుకుంటాడా యెవడైనా. ఇంతకీ రాయలప్రతాపంముందు తిమ్మరుసు బుద్ధికుశలతముందు ఎవరి యెత్తు లేమి పనికివస్తాయి.

పుల్లా:—బావా, కాదుకాని ఆతిరుమలమ్మ ఊరుకుంటుందా? పరాక్రమమునకు పెన్నిధి. పౌరుషానికి పట్టుకొమ్మ. అభిమానాని కాలవాలం, గర్వానికి కాణాచివెయ్యేందుకు ఆనాడు సత్యభామనే విన్నాం. ఈనాడు యీవిడ్నే చూచాం తిరుమలమ్మమాత్రం ఊరుకోదు.

వ్యాఘ్రపు:—అందులో తండ్రిఅంటే చెడ్డఅభిమానం ఆవిడే ఊరుకోడం అప్పుడే శత్రువులమీద కారాలుమిరియాలు నూరుతోందని బావ యిప్పుడే చెప్పాడు.

(వాద్యముల మ్రోతవినబడును)

పుల్లా:—బావా! ప్రతిష్ఠకు సమయంకావచ్చినది. అదిగో బాజామ్రోత. నడునడు. సంభావనానంతరం తరవాయిసంగతి తెలుసుకుందాం.

వ్యాఘ్రపు:—ఔను. నడు నడు.

(ఇరువురు నిష్క్రమింతురు)

విష్కంభము.

---

## ద్వితీయాంకము - మొదటి రంగము

కటకపురము-కోట

సింహాసనమునఁగోపాగ్ని గు ( రి యు చు ( దిరుమల గూరు చుండును-కొమ్మనమంత్రియు సఖి శ్యామలయుఁబరివేష్టించియుందురు.

తిరుమల:—(క్రోధముతో) సచివాగ్రణీ? నాయనగారిజాడ యేమియుఁ దెలియలేదా? వేగులెవ్వరైన వచ్చినారా లేదా?

మంత్రి:—తల్లీ! వెళ్లినవేగు లింకను రాలేదు.

శ్యామ:—చెలీ! నాయనగారు సామంతసాహాయ్యమునకై పోయి యుందురు.

మంత్రి:—కుమారీ! మాండలికప్రభువులు వెడలిపోయిరి. రాయలు విజయస్తంభమును ప్రతిష్ఠచేయుచున్నాఁడట. పగతురు తమకు జయము గలిగినదని కులుకుచున్నారు.

తిరు:—(క్రోధముతో) ఛీ! తిరుమలకంఠమునఁ బ్రాణంబులుండఁగా రాయలకు విజయమా? దాసీపుత్రుఁడగు రాయలకా విజయము. చెలీ! ఎవరికివారు విజయపత్రికలను బ్రకటించుకొని నంత నేమాయె? ఎవ్వరొసంగకున్నను దమకుఁదాము బిరుదులు దగిలించుకొను సిగ్గుమాలు లోకంబునం దెందరులేరు అందు నీకృష్ణరాయఁడగ్రగణ్యుఁడు.

(ఒక సేవకుఁడు ప్రవేశించి)తల్లీ!మహారాజుగారిపంచకల్యాణి...

తిరు:—ఆ! ఏమి? ఏమది? ఒక్కటే తిరిగివచ్చినదా?

సేవ:—ఒక్కటే కంటనీరుకార్చుచూ వచ్చి గుఱ్ఱపుసాల్లో ప్రవేశించింది తల్లీ

మంత్రి:—ఓరీ? గుఱ్ఱమున కేమైన గాయములున్నవా!

సేవ:—లేవుగానిబాబూ వొళ్లంతా నొచ్చినట్లుంది.

(మరియొక సేవకుఁడు ప్రవేశించి) బాబూ! రాజుగారిజాడ వెతుకుచూ వెతుకుచూ వెళ్లగా వెళ్లగా దారిలో రాజుగారిపాగా కనిపించింది ఇదుగో (ఎదుటఁబెట్టును)

తిరు:—(పాగ తాకి) నాయనగారిపాగ ! తండ్రీ ? నిన్నెవ్వరైనఁ జంపియుందురా ?

శ్యామ:—అమ్మా ! అమంగళము ప్రతిహతమగుఁగాక !

మంత్రి:—అమంగళము ప్రతిహతమగుఁగాక !

తిరు:—కట్టా ! తలపాగవీడి నేలపై నుండనేల ?

శ్యామ:—వైరులను మార్గొనుచో నుష్ణీషంబూడి క్రిందఁబడఁగూడదా?

తిరు:—చెలీ! ఏమిమాట్లాడెదవు ? ఇంతకంటెను క్షత్రియజాతికి శిరచ్ఛేద మేమికావలయును ? ఓయుష్ణీషమా ! మహారాజు మూర్ధము నలంకరింపఁదగిన నీ విప్పు డవనీతలమున నణఁగి మణఁగియుంటివా ? ఔరా ? కాలమహిమ! (మఱియొక సేవకుఁడు ప్రవేశించి) తల్లీ ! తల్లీ!

తిరు:—ఏమిరా ? ఏమిసమాచారము ?

సేవ:—మేము రాజుగార్ని వెదుకుచూపోతూంటే దారిలో యీ ఖడ్గందొరికింది. ఇదిరాజుగారిదే (ఎదుటఁబెట్టును.)

తిరు:—(నిశ్చేష్టతవహించి) ఆ! నాయనగారిఖడ్గమేనా? తండ్రీ! నీశౌర్య పరాక్రమములన్నియు నేమైనవి ? ఇంకెక్కడితండ్రి! నాజనకుఁడు జీవించియుండునా? ఉండునేని నీవస్తునముదాయ మరణ్యసీమలఁ జెల్లాచెదరుకానేల ?

మంత్రి:—తల్లీ ! నీవంటి దధీరవలె వాపోవనగునా ?

తిరు:—వగపుకాక మరేమున్నది (ఖడ్గముచేతఁబట్టి కన్నులనద్దుకొని) ఖడ్గరాజమా! గజపతిమహారాజుచేతి కింతభారమైతివా? తన ప్రాణముకంటె నెక్కుడుగా నిన్నుగాపాడుచు ననేకసంగరంబు

లందు శత్రురక్తమును గ్రోలఁజేసి నీకుఁ దృప్తి యొనర్చిన స్వామిపట్ల నిట్టిద్రోహము చేయుదువా? నీ సహజస్వభావమగు నైశిత్యమువీడి మార్దవము దాల్చితివా.

మంత్రి:—వాపోవఁ బ్రయోజనములేదు. కర్తవ్య మూహింపవలయు.

శ్యామ:—నెచ్చెలీ! ఉపేక్షింతుమేనిఁ గోటకుఁగూడ హానివాటిల్లఁగలదు.

తిరు:—(ఖడ్గముఁ గన్నుల నద్దుకొని) ఇది మొదలు నాయనగారి ఖడ్గమునే సర్వావస్థలయందు ధరించి కార్యపరంపర సాధించి తీరెద. ఓ నిశాతఖడ్గమా!

చ. తిరుమల నిన్నుఁజేత నతిధీరతఁదాలిచి నేటినుండియున్
దురమున శాత్రవోత్కరము నున్మి పగన్ బొరిపుచ్చుఁగాన డే
ప్పరమగు వాడిగల్గి పనిపట్టున ద్రోహముఁ జేయఁబోకుమా!
కరము కరమ్మునన్ వెలిఁగి కాంచుము కీర్తిని ఖడ్గరాజమా!

శ్యామ:—చెలీ! ఏల లేనిపోని యాయాసంపాటు. నే నీ వఱకెన్ని పర్యాయములు చెప్పినను నా పలుకాలింపవైతివి గదా! స్వయంబుద్ధి నుపయోగింపక జననీజనకుల దుర్బోధ తలకెక్కించుకొని దాసీపుత్త్రుఁడు దాసీపుత్త్రుఁడని శ్రీకృష్ణరాయలను దిరస్కరించెదవు. అందుచేతనే మన కింతపుట్టిమునుక వచ్చినది. ఆ క్రోధమువలననే కదా కృష్ణరాయలు సకల దుర్గములను గొల్లగొట్టి యుందనుక వచ్చినాఁడు. ఇంక నిన్ను బలాత్కరించియైన వివాహమాడకుండునా? మనరాజ్యమునకు దుర్గమునకుఁ గీడుమూడకుండునా? నిన్నుఁ బెండ్లాడనున్న రాజచూడామణిని మహావీరుని రాయలను వరిం......

తిరు:—(చేతితో శ్యామలనోరు మూసి క్రోధమునఁబండ్లు పటపట కొఱకుచు) ఊఁ. ఏమంటివే శ్యామలా! ప్రాణసఖివిగనుక బ్రతికిపోతివే! నన్నా! కృష్ణరాయలా! వివాహమాడుటయా?

ఛీ! ఉత్తమక్షత్రియకులసంజాతనైన నేను దాసీపుత్రుఁడగు రాయలను బరిణయమాడుదుననుకొనుచుంటివా?

మ. వినుమీ నాదుప్రతిజ్ఞతత్పరతఁదస్వీ! మేటివీరుండటం
చును వేరొందిన కృష్ణరాయలను రాట్చూడామణిఁ బట్టి నె
ట్టన దోఃపాశనిబద్ధుఁజేయుచును గ్రీడావస్తువౌనట్లు చే
సిననాఁడే ననుఁబేరితోఁబిలువు మిస్సీ ప్రాణమింకేటికే?

(రణదుందుభులధ్వానములు వినిపించును)

మంత్రి:—(తొందరపాటుతో) తల్లీ! రణభేరీధ్వానములు వినవచ్చుచున్నవి. శత్రువులు కోటను ముట్టడింపనున్నారు? వేగిరపడవలయును.

తిరు:—ఆ! తాటియాకు చప్పుడులకుఁ గుందేళ్లు బెదరునా? రణదుందుభిధ్వానవితానముల మాత్రమునకు మనమా భయపడువారము. మన మబలలమని తలంచెఁగాఁబోలు రాయలు. మనరక్తనాళములలో దాసీరక్తము ప్రవహించుచున్నదనుకొనుచున్నాఁడా యేమి? (ఖడ్గము పైకెత్తి) నా తండ్రి సముత్సాహంబున నాకుఁజిరకాలము నేర్పిన విలువిద్యానైపుణ్యము మఱియు గురువరులు నాసూక్ష్మసంగ్రహపాటవమునకు మెచ్చి నాకుఁ గఱపిన కోదండపాండిత్యంబు ప్రకాశింప నేడు నాప్రతాపాగ్నికి వైరుల శలభాయితులుగ నొనరించెద.

చ. తిరుమల యాఁడుగోల జగతీపతి దుర్గము వీడిపోయె సం
బరమునఁగోటఁబట్టుకొనవచ్చునటంచుఁ దలంచిరేమొ తి
మ్మరుసును రాయలున్ వెఱపు మానుఁడు లెండు పరుండు శాత్రవో
త్కరమును జీల్చి చెండుద మఖండజయంబు గ్రహింత మిత్తఱిన్.

జాగుసేయక లెండు! లెండు (కత్తిఁద్రిప్పుచు)

చ. కనుమొఱఁగేమిలేని విలుకాండ్రకు విందులు నమ్మ్లించు నా
కనిమొనఁదోడునీడయగునంతటఁజూతుము నాప్రతిజ్ఞ యీ
జనకుని చేతిహేతి కిక శాత్రవవీరుల క్రొత్తనెత్తుటన్
మొనసి మహాభిషేకమయుప్రూజ రొయిన క్చేద యుద్ధవేదికన్.

మంత్రిశేఖరా ! వలయు యుద్ధసామగ్రి తక్షణమే సిద్ధము చేయింపుము పరాక్రమోపాయంబులు నెఱపి రాయలను గీయలను జీల్చి చెండాడవలయు.

సీ. కోటగుమ్మములెల్లఁ గొమరొప్ప మూయించి
నేర్పరులగువారి నిలుపు డచట
మొలపుతో నూనియల్ సలసలకాచించి
చిమ్మనగొట్టాలఁ జేర్పుడింక
పైరులపై శిలావర్షంబు గురిపింప
నెగురాల రాశిఁజేయింపు డవల
కోటగోడలమీఁది వాటంపుబురుజుల
గొప్పతుపాకులఁ గూర్పుఁడిపుడు

గీ. తొలుతవలె మోస మేదేనిఁగలుగ దేని
విజయలక్ష్మికిఁ బ్రాణ మర్పించిమైన
నిట్టలంబగుపట్టంబు గట్టవలయు
రండు రండిక ముందుకార్యంబు నడుప.

(తెరపడును)

## రెండవరంగము

రాయలగుడారము - (రాయలును దిమ్మరుసును పీఠాధిష్ఠులైయుందురు)

రాయ:—అప్పాజీ ! శుక్రబృహస్పతుల పన్నుగడలకైనఁ దిరుగున్నది గాని మీయెత్తులకు మారుగలదా ?

చ. బలరిపువజ్రమైన మొనవాయఁగవచ్చుఁద్రిశూలిశూలముల్
దూలఁగి నిజప్రభావమును దూలఁగవచ్చు నుపేంద్రుచక్రముల్
దలఁకఁగవచ్చు మేటిసుమధన్వనియేటులు తప్పవచ్చు నీ
తలఁచినయట్టియెత్తుగడఁదప్పుటయున్నదె మంత్రిశేఖరా ?

తిమ్మ:—ప్రభూ ! ప్రభువును బట్టియేగదా సచివులును

గీ. దొడ్డభూపాలశేఖరుల్ దొరకినపుడె
బుద్ధిఁబ్రకటింప నవకాశములు ఘటిల్లు
మంచిగీటురా యొందు లభించినపుడె
కాంచనశలాక క్రొదవుఁ జక్కనిపరీక్ష.

రాయ:—(నవ్వి) సచివాగ్రణీ ! ఇప్పటిమనవిజయ మొకవిజయము గాదు. తిరుమలను స్వాధీనముచేసికొనిననాడేయఖండవిజయము

తిమ్మ:—(చిరునవ్వుతో) ఆతిరుమల యంత తేలికగా స్వాధీనమగునా?

రాయ:—(కొంచెముకోపముతో) ఏమి ? గజపతి దుర్గస్వాధీనానంతరము కార్యమంతయు లోంగుబాటునకు రాదా ?

తిమ్మ:—రాకేమికాని యాకోట స్వాధీనమగుట యెట్లు ? మహాబలిష్ఠమై దుర్భేద్యమై దుర్గమమైనయాకోటకొమ్ములమీఁద యుద్ధమునకు సర్వమును సిద్ధముచేయించి నిజసైన్యములను మేఘగంభీరనిర్ఘోషంబున హెచ్చరించుచు ఖడ్గరాజమును గేలంగీలించి కోటగోడపై నెక్కుడఁజూచిననుదానయైయపరదుర్గయానయన నాతిరుమల విరాజిల్లుచున్నది.

ఉ. శారదపూర్ణిమావిమలచంద్రసమానముఖంబు గ్రీష్మకా
లారుణభానుమండలభయంకరరూపవిశేషమై ఖరిక్
దేతి కనంగరాక గడిదేతినవేలకొలందిమూఁకలక్
దారుణసింహగర్జన నినాదములన్ బురిగొల్పు నల్కతోన్.

రాయ:—ఏమి? అచ్చట శృంగారమేకాక వీరమును గన్పట్టుచున్నదా?

తిమ్మ:—ప్రభూ ! కన్పట్టుచున్నదా యనకుఁడు. తిరుమల వీరశృం గారములకుఁబుట్టినిల్లుకాదా యనుఁడు.

సీ. పాత్రము లేగినవార్తఁ బడసి రోసంబుతో
జయమొందఁగలుగు హాసంబుతోడ
మీప్రతాపమువిన్న మిక్కిలి యలుకతో
నలుఁగుఁజేపట్టిన కులుకుతోడ
ప్రాఁబడ్డసాదనఁబరగించు తూపుతో
జోటీపై నెన్నైనచూపుతోడ
కదనభీరులపట్లఁగన్నులకెంపుతో
శూరాగ్రణులదిక్కు సొంపుతోడ

గీ. రగులుపఱచెడి శింజినీరవముతోడ
రవరవలు సేయు మంజీరరవముతోడ
వీరశృంగారరసములు వెల్లివిరియఁ
దేజరిలుఁ గోటకొమ్మనఁ దిరుమలాంబ.

అట్టివీరకాంతామణియగుతిరుమలచే సురక్షితంబగు నాకోట మన కెప్పాట వశంబుగాఁగలదు. రాజేంద్రా! మనము బాహుపరాక్ర మమే నెఱపి యుత్తటి జయంబునొందుట కలలోనివార్త

రాయ:—అప్పాజీ అట్టికాంతామణినిఁజెట్టఁబట్టినవాని దేక దాపుట్టువు.

గీ. వీరశృంగారములకు నాధారమైన
తిరుమలను గోరి పెండ్లియై తేజరిలుట
రవిమృగాంకుల నొకశరీరంబునందె
తాల్చి మెఱయుటకాదె యుత్తమచరిత్ర ?

తిమ్మ:—విష్ణ్వంశ సంభూతులరగు మీరాగట్లొనరించుట సమంజసమే. కోటపైనుండి వైరులును గోట వెలుపలఁగ్రిందనుండి మనవారును యుద్ధము సేయుచో మనకు జయమా? తిరుమల స్వాధీనమా?

రాయ:—ఔను, అది యసంభవము హానికరమును.

ఉ. చక్కటికయ్యమందు మన సైనికు లెంతటి యుక్కుతునక్కలై
తక్కువకాక పెక్కువను దాల్చిన దుర్గము మీఁదినుండి వా
రుక్కు మడంచుచుండ నెవఁడోపు రణం బొనరింప నక్కటా?
యెక్కినవాని కెప్పుడును నేనుఁగు లొజ్జనుఁగాదె ప్రెగ్గడా!

కావున మన ముపాయంబు మెఱయఁ గార్యసాధనకుఁ గడంగవలయు.

తిమ్మ:—దేవర యాగ్రహింపరేని.

రాయ:—అప్పాజీ యెడఁదనయున కాగ్రహమా?

తిమ్మ:—ఆ॥ వె॥ కత్తిపోటువలనఁ గలన నొక్కఁడె కూలుఁ
గానిపించుఁబోటు గంటఁబడక
కలముపోటువలనఁ బలురాజ్యములుకూలుఁ
గలముపోటుమిన్న కత్తికన్న.

రాయ:—కావున నేకదా యుపాయంబున నంటి.

తిమ్మ:—రాజేంద్రా! మహారాజ్ఞీలక్షణలక్షితయగు తిరుమలను మీకు వివాహంబుఁ జేసితీరెదనని యిదే (చేయెత్తి కట్టబడిన కంకణమును జూపుచు) కంకణమును గట్టుకొంటి. ఇదే యాంధ్రరాజ్యాభివృద్ధికి బద్ధకంకణమై ప్రకాశించుఁగాక! అట్లుకాదేని నీకంకణబంధమే నాకంఠమునకుఁ గాలపాశబంధ మగుంగాక. పరాక్రమంబుననో యుపాయాంతరంబుననో యెప్పటికైన మీకవశ్య మా తిరుమలదేవిని వశ్యం జేసితీరెద.

రాయ:—అప్పాజీ? మీవంటిమంత్రిపుంగవుఁ డుండ నాకుఁగొఱంత యేమి? కాని మీరింత భయంకరప్రతిజ్ఞఁ జేయనగునా?

తిమ్మ:—ప్రభూ! ఇది యీనాటి ప్రతిజ్ఞ కాదు. సాముద్రికశాస్త్రజ్ఞుల రావించి యేనాఁడీ తిరుమలకు మహారాజ్ఞీలక్షణంబులు గలవని తెలిసికొంటినో యేనాఁడు నాగురువర్యులగు నాదిండ్లచిట్టి

గంగనామాత్యులు 'నాయనా! ఆంధ్ర రాజ్య సంస్థాపనార్థము నీయావచ్ఛక్తి ధారవోసి నా తుదికోర్కి తీర్పుమా' యని తన యవసానకాలమున వానిచేతిలో నాచేయి వేయించుకొని నాచేఁ బ్రతిజ్ఞగావింపఁజేసెనో యానాఁడే యీకంకణము గట్టుకొంటిని. విజయా!

(విజయుఁడు ప్రవేశించి జోహారొనర్చి నిలచును.)

తిమ్మ:—కాగితమును గలమును......

(విజయుఁడు తెచ్చి బల్లపై నుంచి వెడలిపోవును.)

రాయ:—(తిమ్మరుసు ముఖమును తెప్పవెట్టక చూచుచుండును.)

తిమ్మ:—(వ్రాయుట నభినయించును.)

(తెరపడును.)

---

## మూఁడవ రంగము

(కటకపురము - కోట - భయంకరాకారముతోఁ గోటగోడపైఁ దిరుమల ఖడ్గహస్తయై నిలఁబడును.)

తిరు:—దుర్గద్వారములన్నియుఁ గట్టుదిట్టముగ మూయించి మంత్రిని శ్యామలను బశ్చిమోత్తరద్వారంబులఁ గావుంచితి. యుద్ధపరికరములన్నియు సిద్ధపఱుపఁబడినవి. నీనే దుర్గాగ్రంబున నేనిలిచి రాయలసైన్యము కంటఁబడుటయే తడవుగాఁజీల్చి చెండాడి కసిదీర్చుకొందుఁగాక! ఓ కరవాలమా!

సీ. ఆసేతుపర్యంత మలజడిపఱచిన
యవనరక్తవ్రాత మానినావు
పీఠికానగరాది పీఠస్థుల నడంచి
వెలమలరక్తంబుఁ బీల్చినావు

పేరుపెంపునుగన్న పెద్దాపురాధీశు
శూరరక్తముఁ జవిచూచినావు
పాండ్యకేరళ చోళపల్లవ మళయాళ
ధరణీశరక్తంబుఁ ద్రావినావు

గీ. అంతకంటెను మధురమై యమలమై ప
రాక్రమాఢ్యమై కుంకుమరాగమై య
ఖండమైన కన్నడులరక్తంపుధార
నేఁడు ఖడ్గమా ! కడుపారఁ గ్రోలఁగలవు.

రాజులేనికారణమునఁ దనయిచ్చవచ్చినట్లు చెలరేగనెంచెను గాఁబోలు రాయలు. పరాక్రమధనులగు నాసైనికులు వారి మచ్చు మాపఁజాలరా ? (సేవకుఁడొక డరుదెంచి జోహారొనర్చి యొకజాబు నందిచ్చి వెడలిపోవును. జాబువిప్పి చదివి క్రోధముతో నలిపి) నాదృఢ సంకల్పమున కీలేఖ యెంతయో యంతరాయమునుగల్పించుచున్నదే. ఏమి ? ఆపదలపై నాపదలు పరంపరగా వచ్చుచున్నవి. ఔరా! కాల మహిమ! యుద్ధమున కింత సిద్ధపడి మానుదునా? మానఁజాల మానఁ జాల (యోజించి) మానకుందునేనిఁ బరులచేతులలోఁ బడినచో నామాన ప్రాణంబులుదక్కునా ? ఈలేఖలోనిసంగతు లెంతవింతగా నున్నవి? (విప్పిచూచుచు) శ్రీకొమ్మనామాత్యులను దిమ్మరుసు దీవించి వ్రాసినలేఖయఁట ! ఏమని ?

ఉ. ఇమ్ముగఁ గృష్ణరాయలకు నింతి నొసంగుట కొల్లవేని దు
ర్గమ్మును గొల్లగొట్టి యొడికమ్మున నామె బలాత్కరించి—

(క్రోధముతో) బలాత్కారమా? రాయలకెంత కండకావరము?

పూజ్యమ్మగు రాజధానిని మహావిజయేందిరతోడఁగూడ మా
సొమ్ముగ నిల్పుకోఁగలము సూడిదఁబెట్టుచు శౌర్యవిత్తమున్.

(నవ్వి) అబ్బా! ఏమిశౌర్యము! దాసీపుత్రునిపరాక్రమమెల్లరకుఁ దెల్లమే. నిరాయుధుఁడైన నాయన్న వీరభద్రగజపతినిఁ గొండవీట బంధించిన నీసాహస మెవరెఱుంగరు? సీతారాలు తిరుమలదగ్గర సాఁగిరావు (మరలజాబుచూచి)

చ. నయమున బోధనేతి నరనాథులకుం దగవొలఁ జెప్పిరం
బ్రియమున మీదు కోట యొకరేవునఁజేరిన యోడ యద్దియే
పయనము చేయుకాలమునఁ బ్రాతయొ క్రొత్తయొ చిల్లులెన్ని యో
బయలుపడం బునుంగుమని వార్ధి మునుంగు నమాత్యశేఖరా!

(యోజించి) ఏమిది? ఇవిమిక్కిలి భయంకరవిషయములుగాఁ బొడఁగట్టు చున్నవే! మంత్రితిమ్మరుసు చండశాసనుఁడు. ప్రతాపేశ్వర పాత్రుఁడు కోటలోనుండి పారిపోయి కానరాడనికదా మామంత్రి వచించె. నిన్న పాత్రు లొనర్చిన మోనము కలంచిన గుండెగుభిల్లుమను చున్నది. ఎవ్వనిఁజూతమన్నను దిన్నయింటివాసంబుల లెక్కిడువారే. ఈకోట యోడ యనుటచేతను బయనమైనఁగాని చిల్లులు బయలుపడ వనుటచేతను గోటలోనే రంధ్రాన్వేషణపరాయణు లుండిరనుట స్పష్టము. దానికిఁదగిన తార్కాణములు పొడగట్టుచునే యున్నవి. రాజద్రోహులు-స్వామిద్రోహులు-కోటను నన్నుంగూడఁబట్టి విరోధుల కీఁగలరు. ఇట్టి విద్రోహులమూలముననేకదా మున్నెన్ని యో రాజ్యంబులు మన్నఁగలిసినవి. (జాబును మరల పఠించి) ఏమి?

ఆ॥ వె॥ ఎంతమంచిదైన నెంచఁబోవుదుమేని
మంచమెల్లఛిద్రమయమునుగాదె
కానిపించునట్టి ఘనదోషులెల్లరు
నద్దమందు మొదుపు లరసినారు.

ఔరా! కోట యెంతబలిష్ఠమైనదైనను ఛిద్రమయంబనుటచే ద్రోహులు రహస్యమార్గములను వైరుల కప్పుడే తెలిపిరనియు వారు

మన పుట్టిముంచనున్నవారనియుఁ దెలుచున్నది. (యోజించి) అసత్యము! కాదు - సత్యము ! సత్యము ! పాత్రులవర్తనమే ప్రబల తార్కాణము. ముమ్మాటికి సత్యమే. ఘనయోధులు - అద్దమందు ముదుపు లనుటచే గొప్పగొప్పవీరులువోలె మా సేనాధిపతులు గన్పట్టుటయేకాని తుదకు నిరర్థకులని తేలుచున్నది. ఇంటిగుట్టు లంకకుఁజేటను మాట నిక్కమకదా ! గజపతియంతవానిని మోసగించినవారికి నేనొకలెక్కయా? (క్రోధముతో) ఛీ ! అట్టితుచ్ఛులు నట్టి దేశద్రోహులు పొడఁగట్టిరేని కనుపుగొట్టి కాకులకు గ్రద్దలకుఁ బెట్టకుందునా ? వంచకులు పరబలంబులను చేరకయే యున్నచో భేదింపరాని యీ కోటఁ గొల్లఁగొట్టెదననియు - నన్ను బలాత్కరించి చేపట్టఁగలమనియు వ్రాయ సాహసించుటకు రాయల కెన్నిగుండెలున్నవి ? అహంకారపూరితమైన 'బలాత్కార' మను నా దాసీపుత్రునిమాట నాయొడలిని బగ్గుబగ్గునమండించుచున్నది. (ఆలోచించి) వలదు. కోపమువలదు. కోపము పాపకారణము. కోపము సర్వకార్యవినాశనకరము. కార్యసాధనకుఁ గష్టసుఖములను గణింపరాదు. వైరి నుపాయాంతరముననైన జయించుట యనాదిసిద్ధమగు రాజనీతియేకదా! వజ్రంవజ్రేణభిద్యతే యనునట్లు మోసమును మోసముననే భేదింపవలయు. ఔను. అప్పుడుగాని నాసంకల్పమీడేఱదు. వినయముననే కార్యమును సాధించుకొందు. రాయలు నాచేఁజిక్కిన పిదపఁ గసిదీర్చుకొనరాదే? (చిరునవ్వునవ్వి) ఇదే మంచియుపాయము.

ఉ. "తాళగలేము రాయలప్రతాపమహాగ్నికి రండు పెండ్లికే
యాలములేకయంచు" సచివాగ్రణి నుత్తర మంపు మందు భూ
పాలునిఁబట్ట నప్పటి కుపాయము తోఁచదె వంటియింటికుం
దే లతిఁడెందుఁబోఁగలఁడు తేలికయా నిఁక నెల్లకార్యముల్

(తెరపడును)



శ్రీ

# తిరుమలదేవి నాటకము

## తృతీయాంకము

### మొదటిరంగము

(తిమ్మరుసును రాయలును బ్రవేశింతురు.)

తిమ్మ:—ప్రభూ! మీప్రతాపాగ్నికిఁ దాళలేక వైరులంపిన లేఖఁ దిలకించితిరా?

రాయ:—సొబగుల దీవియగు తిరుమలదేవి యంపిన లేఖఁజూచితిమి. సంగతులు విశదమైనవి. వివాహమునకు సర్వముసిద్ధము సేయించితిరా?

తిమ్మ:—సర్వముసిద్ధము. వివాహము నేఁడే జయప్రదముగా జరిపించి వచ్చెదను. మీ రీగుడారమునందే భద్రముగానుండుడు.

రాయ:—(పక్కునసవ్వి) అప్పాజీ! పెండ్లికొడుకులేని పెండ్లియా?

తిమ్మ:—ప్రభూ! ఇది యట్టిదే!

రాయ:—(ఆశ్రమముతో) కారణము—

తిమ్మ:—ఆ లేఖలోనిసంగతులన్నియు నిక్కమని యేనా మీానమ్మకము.

రాయ:—సత్యదూరము గాఁజాలవు.

తిమ్మ:—సత్యమును గాఁజాలవు. వెండియు ఫలవిషయమున నాకావంతయు నమ్మకము లేదు. మన పేరు వినినంతన ప్రళయకాల

కరాళకాళికామూర్తివోలె రౌద్రరూపముఁదాల్చి కోటగోడపైఁ బరవళ్లుద్రొక్కుచు మనలను మనసేనావాహిని నింకింపఁజేసెద నని కంకణముఁ గట్టుకొనిన తిరుమల (చిరునవ్వుతో) వివాహమున కంగీకరించెనని వ్రాయఁబడినంత మాత్రమునఁ బ్రభూ! మనము విశ్వసింపవచ్చునా !

**రాయ:**—నమ్మరాదే యనుకొందము. వివాహమైనవెనుక వారు చేయునదేమి ? నమస్తము మనవశమే కదా !

**తిమ్మ:**—(ఆలోచనన భినయించుచు) ఏమైననుసరే ! మీరాక మిక్కిలి హానికరము. మీరింక దేయుండుడు. వివాహము నిర్విఘ్నముగా జరిపించివచ్చెదను.

**రాయ:**—(నిట్టూర్పువిడిచి) అప్పాజీ ! చింతామణీ మందిరస్థమగు తిరుమలచిత్రఫలకము మన్మనోముద్రితమై యూడిరాకున్నది. ఫలకగతతిరుమలయే చిత్తమును దస్తరపెట్టుచుండ నమీపించియు నానరోజాక్షి నెట్లు నమీక్షింపకుండఁగలను ? ఏమి సోయగము!

ఉ. లేమల నెందఱంగనుటలేగు జగంబున నెంచిచూడ నా
కోమలిఁబోలుదానిఁగనుగొందుమె వింతసదర్శనంబుగ౯
దామరచూలిచేసెఁదనసై పుణిఁజూపఁగ నామెఁ గానిచో
నీమహిఁదన్సరోజముఖి కెందు 'నహిప్రతి' పల్కనేటికి౯.

**తిమ్మ:**—సౌందర్యమొక్కటియేకాదు. ఆ కాంతను వివాహమైన యాతఁడు చక్రవర్తియౌనని దైవజ్ఞులు వచింపలేదా ? కావు ననేకదా మనదండయాత్రల విజృంభణము.

**రాయ:**—ఆసర్వభద్ర లక్షణలక్షిత నాయనన్యసామాన్యసౌందర్య రాశినిఁజూడ కేరీతి నిప్పు డొంటరిగా నిందుండఁగలను ? ఆ కల్యాణమంటపంబున నానవలావణ్యవతీ శిరోమణినిఁగనులారఁ

గాంచవలయుననుకోరిక ప్రేల్లువాఱుచున్నది. అప్పాజీ! అప్పాజీ! కల్యాణసముదుదంచిత శృంగారాంచితమహా సౌందర్య విభాసివరవర్ణినీదృశ్యము మఱల నెన్నఁడైనఁ గంటఁ బడునదియా? పరమరసజ్ఞులును నగస్త్యకృతసంస్కృత బాల భారత మహాగ్రంథవ్యాఖ్యాతలునగు మీకుఁ జెప్పవలసినదే మున్నది? నన్నిటులైన నచటికిఁ గొనిపోవు భారము మీదే.

తిమ్మ:—ప్రభూ! మీమాట కెదురాడఁజాలఁగాని మీరాక మిక్కిలి హానికరము కాకపోదు.

రాయ:—దాని కుపాయమే దేని యోజింపవచ్చునుగదా?

తిమ్మ:—ఉపాయమేమి? అపాయ మొక్కటే కన్పట్టుచున్నది.

రాయ:—(నవ్వి) ఉపాయమేలేదా? ఔను. మీకిష్టములేనికార్యమున కుపాయమే యుండదు. అయిననాఁ డన్నియు నుపాయములే. పోనిండు. నేనే యుపాయమును జెప్పఁగలవాఁడ. నేను మారు వేషముతో మి మ్మనుసరింపఁగూడదా? అప్పు డాపద కావ్పద ముండునా? అప్పాజీ!

ఉ. ఏల విచారమింక సచివేంద్రుఁడ చాకి పురోహితుండుఁ దాం
బూలకరండవాహకుఁడుఁ బోల్పఁగ వైద్యుఁడు దాసియుఁగా మహీ
పాలుర లోనగల్లఁ బ్రతిబంధము లేక చరింత్రు గానఁ దాం
బూలకరండవాహకునిభూమికఁ దాల్చి చరింతు మీకడన్.

తిమ్మ:—(నవ్వి) ఇది క్రొత్తయవతారమే. ప్రభువులవతారపురుషులు గదా! సేవ్యుఁడు సేవకుని సేవించుటయా?

రాయ:—అప్పాజీ! నన్నింతగా గుర్తించితిరా? బృహస్పతినారాధింపని యింద్రున కెందేని విజయముకలదా! అది యట్లుండనిండు.

ఉ. చేకొని నన్ను బ్రోచితివి చిన్నటనాటనుగోలె యాతనా
నీకమునుండి కాచితివి నిక్కముగా జనకుండవీవ చీ

కాకు ఘటించునే భవదఖండపదంబులపూజ నాకు నీ
కాకులుచుట్టి భక్తిమెయి నంది యొసంగుటకన్న నున్నదే !
ఈ వ్యాజముననైన మీకు సేవచేయుభాగ్యమునాకులభింపఁగూడదా!

తిమ్మ:—(చిరునవ్వుతో) మీయుక్తికి బదులులేదు. అట్లేచేయుఁడు.

రాయ:—అప్పాజీ! ఆహ్వానంబులఁబంపుమని చెప్పనక్కరయేలేదు కాని

ఉ. పెద్దలఁబెద్ద పెద్దనను బిన్నలలోపలఁబిన్నయైననున్
బెద్ద బలే చమత్కృతుల నేర్పులఁ దీర్పుల హాస్యవార్ధికిన్
హద్దగురామలింగని మహాత్మునిధూర్జటిఁ బిల్వఁబంపుమా
సుద్దులు వేయునేల కవినూరులు లేనిదె పెండ్లి పెండ్లియే!

తిమ్మ:—ఆంధ్రకవితాపితా మహుండగు పెద్ద నార్యుఁడును నతులిత
వాఙ్మాధురీమహిమాధురీణుఁడగు ధూర్జటియు నసమానవాక్చ
మత్కార తరంగోత్తుంగులగు రామలింగాదులును మన
యొద్దనే యుండిరికదా! ప్రభూ! మారువేషముగదాయని మై
మరచియుండక యప్రమత్తులరై మెలంగుదురుగాక యని
హెచ్చరించుచుంటి. మీ రెట్లనను న న్నునుసరింపకమాన
రని ముందే యోజించితి. తగుసన్నాహములన్నియు నేర్పాటు
గావింప నాజ్ఞాపించియే యిచ్చటకు వచ్చితి.

రాయ:—పరేంగితజ్ఞానవరిష్ఠులగు మీ రెఱుంగని దేదికలదు ?

తిమ్మ:—రాజేంద్రా! మనము పోయి ముందుకార్యమునకుఁ గడంగు
దము.

రాయ:—మంచిది. (తెరపడును)

---

## రెండవరంగము

### గజపతికోటలో వివాహమంటపము

(ఒకవైపునఁ దిమ్మరుసుఁ దాంబూలకరండవాహకుఁడుఁ, బెద్దన, ధూర్జటి, రామలింగముఁ బురోహితులు మొదలగువారు కూర్చుందురు- బంగారుపాలకీ యచ్చట నుంచఁబడును. రెండవవైపునఁ గొమ్మన మంత్రి - రాజబంధువులుఁ బురోహితులుఁ గూర్చుందురు. తెర యెత్తఁబడును.)

కొమ్మ:—(నలుదెసలీక్షించుచు నందలంబునఁ గలయఁజూచి) రాయలవా రెక్కడ ? ఈ యందలమునం దెవ్వరును లేరే ? (తిమ్మరుసువైపు తిరిగి) తిమ్మరుసుగారూ ! పెండ్లికుమారుఁ డెక్కడ ?

తిమ్మ:—(పురోహితునకుఁ జేసంజ్ఞ చేయును)

పురో:—(పాలకిలోని కత్తినిఁదీసి కళ్యాణమంటప స్తంభమున కానించును)

తిమ్మ:—మంత్రిసత్తమా ! ఇది కత్తిపెండ్లి. రాచపెండ్లిండ్లు చాలవఱ కిట్టివేకదా ! అందును

గీ. భూరితుళువాన్వయంబునఁ బొడమువారు
బాకునకు బాసికము గట్టి పరిణయంబు
సలుపు టాచారమయ్యె! శాస్త్రంబుకంటె
నరయ నాచారమే బలీయంబుగాదె ?

వేయేండ్లపంట. పెండిలిపట్లఁ గులాచారంబుల నతిక్రమించి నడువరాదనుసంగతి మీరెఱుంగనిది కాదు.

(సర్వాలంకారభూషితయగుతిరుమల పూలమాల చేతంగొని శ్యామలతీసికొనిరాఁ గల్యాణమంటపముఁ బ్రవేశించి ప్రేగంటఁదాంబూల

కరండవాహకునిఁజూచుచు తనలో) ఎవ రీ కరండవాహకుఁడు ? ఆ విశాలఫాలతలము నయ్యాకర్ణాయతనేత్రములు నాశ్రీకారాకారకర్ణ యుగ్మము నయ్యోగుభుజంబులు నయ్యాజానులంబితహస్తములు రాజ లక్షణంబులై కన్పట్టుచున్నవి. రాయలు ప్రచ్ఛన్నుఁడై వచ్చి యుండునా ? సందియమేమి ? ఆవ్రేలి రాజముద్రిక నాసందియమును బూర్తిగాఁదొలగించినది. ఆహా ! ఏమిపినిరూపసౌభాగ్యము. ఈతఁడు దాసీపుత్రుఁడెట్లుకాఁగలఁడు (తలపంకించి) ఛీ ! నావిధ్యుక్తధర్మము మఱచుచుంటినే ? ఈవేసినయెత్తునకుఁబై యెత్తు వేయవలయు.

పురో:—అమ్మా ! ఈఖడ్గము నాపూలమాలచే నలంకరింపుము.

తిరు:—(పూలమాలచేఖడ్గమునలంకరించును) (ఆసనాసీనయగును)

పురో:—అయఁముహూర్తస్సుముహూర్తోస్తు.

బ్రాహ్మ:—తథాస్తు (అక్షతలుచల్లుదురు) (బాజాలుమ్రోగును)

కృష్ణ:—(తనలో) ఆహా ! ఇట్టిలోకోత్తరసౌందర్యవతి నభూతో నభ విష్యతి యనిన నతిశయమా ?

సీ. కలదు లేదన నొప్పు జలజాక్షి నెన్నడు
మెంతలోచూచ్చి నౌగ నంత హెచ్చు
వలజేసి విలువంచు నెలనాగ భ్రూయుగం
బెంతవంపో ముఖ మంతసొంపు
కారుమబ్బులగేరు కనకాంగి కచబంధ
మెంతనల్పో నగ వంత తెలుపు
మదమరాళముసెంచు మానినీమణి యాన
మెంతజంపో పిఱుం దంత పెంపు

గీ. ఔర! యీ యంద మీ చంద మీఁ రువార
మమరవిద్యాధరాప్సరోయక్షకిన్న

రాంబురుహా నేత్రలంను నెంద్రైనఁ గలదె
స్రష్టసృష్టికి వెలి తొలిసృష్టి యేమి?

(మైమఱచి చేతిలోని తమలపాకులను జాఱవిడుచును)

తిమ్మ:—(తిరుమలదేవి రాయలచేతి యుంగరము గుర్తించుటను గని పట్టి) ఓరీ! నీవుంగరమొదలెఱుంగకున్న వాఁడవు. ఇంక యాత్రగా త్రయా! నున్న మెక్కువైన నోరు పోక్కదా! (అదలించును.)

వాక:—(గ్రహించి యాకులు రాచుసట్లు నటించుచుఁ దనలో) ఓహో! ఈయుంగరమును జూచి నన్ను దిరుమల గుర్తించు నని ధీమంతుఁడప్పాజీ గ్రామ్యోక్తి సూచించుచున్నాఁడు. రాజముద్రికఁ దొలఁగింపమఱచితిని. (వణఁకొనుచు ప్రకాశముగా) సిత్తంబాబు! సిత్తం! ఒళ్లు తెలీదంలేదు. చరిగా చూత్తా. చరిగా రాత్తా! (ఆకులు రాచుచుండును.)

తిరు:—(మంత్రి చెవిలో రహస్యముఁ జెప్పును.)

పుల్లావధాని:—వెంకయ్యా! మనపుణ్యం పుచ్చిందివాళ. సంభావనలు గొప్పగానిమ్మని ఆతిరుమలమ్మ మంత్రికి రహస్యంగా చెప్పింది కావలయు. ఎల్లాగా మహారాజుబిడ్డ మహారాజుబిడ్డేరా.

వ్యాఘ్రపాద శాస్త్రి:—తిమ్మరుసుగారూ! ఇక్కడ మాకు గౌరీపూజకు మామూలు వస్తుందండి.

తిమ్మ:—ఏమి మామూలండి?

వ్యాఘ్ర:—సామాన్యపుఁ బెండ్లికైతే ఒకటి రెండు మూఁడువరహాలు ఇల్లా ఉంటాయి. నాల్గువరహాలకు తక్కువైతే మీదర్జాకు లోటౌతుందేమో యని చెప్పడానికి సంకోచిస్తున్నానుబాబూ!

తిమ్మ:—ఇవిగో! వరహాలెనిమిది. రవసెల్లాయొకటి.

వ్యాఘ్ర:—అదీ! అల్లాఉండాలి వితరణమంటే.

వెంక:—బాబుకి బారా మూరా యేకటేరా.

పురో:—అవధానులుగారూ! మీరు దయచేసి సభాతాంబూలం పుచ్చుకోండి.

వ్యాఘ్ర:—ఊరిలో పెద్దలు పుల్లావధానులుగారికి ముందిప్పించండి.

పుల్లా:—ఊరిలో వారి మాటకేమిలెండి. విద్వాంసులు ఘనాపాఠీలు మీరే ముందుగా పుచ్చుకోండి.

పురో:—ఎవరోఒకరు రండయ్యా! మీగుమీరని తగువులాడడంతో సరిపోతూంది.

అవ:—ఆచారమే బలీయమన్న తిమ్మరుసయ్యావారి సిద్ధాంతం ఉండనే ఉందిగా! ఆచారానికి భిన్నమెందుకు? గ్రామపెద్దకిప్పించండి బాబూముందు.

వెంక:—పుల్లావధానీ! తెగసాగక త్వరగా పుచ్చుకోవోయి. అవతల యింకో సంభావన దాటిపోతూంది. (వానిచేయి పట్టుకొని యెదుటికీడ్చును) సంభావన పుచ్చుకొని యొకొక్కడే పోవుచుండును. (తెరపడును)

---

## మూడవరంగము

రాజమందిరద్వార సమీపము

మందిర ద్వారోపరిభాగమున జేయి యడ్డుపెట్టి చాకలి నిలిచియుండును.

పెద్దన, రామలింగము, ధూర్జటి-రాయలు-తిమరుసును ప్రవేశింతురు.

రాయ:—అప్పాజీ! మీదూరదృష్టికి గాన్పించనిది లోకమునందేదేని కలదా? మీ చెప్పినచొప్పున నిప్పుడు మెప్పివచ్చినది.

తిమ్మ:—ఏమది ? (ఆలోకించి) ప్రమాదము! ప్రమాదము! మనము సత్వరము పోవలయు. మిమ్ము దేవి యిదివరకే గుర్తించినది. ఆ గుమ్మముకడ నిల్చినది చాకలి. ఇపు డుపేక్షింపక మన ము వానిచేతిక్రిందినుండి దూరిపోవలసి వచ్చెఁగదా !

రాయ:—ఛీ ! చాకలివాని చేతిక్రిందినుండియా నేను దూరివచ్చుట!

తిమ్మ:—రాజేంద్రా! ఇప్పుడు మీరావేశములు పనికిరావు. మిమ్ముఁ బట్టుకొనుట కా తిరుమల చేసిన యుక్తియే యిది. వేగి రింపుఁడు ! వేగిరింపుఁడు!

రాయ:—(అసహ్యముతో) అప్పాజీ! చాలు చాలు.

ఉ. పుట్టితి రాజవంశమునఁ బూజ్యతరమ్ముగ రాజ్యలక్ష్మిఁ జే
పట్టితిఁ బౌరుషమ్మునకుఁ బట్టయి పొల్చుచు వైరిదుర్గముల్
గొట్టితి నట్టినే నిపుడు కోవిద ! చాకలిచేతిక్రింద నె
ప్పట్టున దూఱిపోఁగలను ప్రాణముపోయినఁ బోవనిమ్మిటన్.

తిమ్మ:—కట్టా! తరంగన్యాయమున విపత్పరంపర లుప్పతిల్లుచున్నవి. ఇప్పుడించుక నే పాలసించుటకైన వీలులేదు. ఉపాయమా కానరాదు. (నిమిషము యోచించి రామలింగమును జూచి) ఆ! వికటకవీశ్వరా! ఉపాయాన్వేషణమునం దందెవేసినచేయి వీవు. యుక్తి పన్ని మమ్ముల నిప్పుడు కాపాడు భారము మీది.

రామ:—(చిరునవ్వునవ్వి) మంత్రిసత్తమా! అదెంతసేపు? మీరు నా వెనువెంటనే వచ్చుచుండుడు. (ముందుపోయి) చాకలి మడేలుగారూ! దండాలండోయి దండాలు (చేతులు జోడించుచు)

చాక:—(నివ్వెఱపడి చేతులుజోడించి) బాబ్బాబుబాబూ! మీరు బేమ్మలు. మాకాయినస్సు తక్కువైపోదూ! రచ్చించండి

బాబూ రక్షించండి. మీపాదాలికి దణ్ణాలు (సాష్టాంగ నమస్కారముచేయును)

తిమ్మ:—(మందిరద్వారముదాటిపోవుచు,)

ఉ. పారములేనియుక్తులను బన్ని యొనర్తువు శృంగభంగ మే
ద్వారలకైన సత్కవితఁబల్కఁగ జాణవు భూతలంబునన్
లేరిక రామలింగకవి! నీకెనవచ్చెడు వారలు —

రాయ:—(గుమ్మముదాఁటిపోవుచు నానందాశ్చర్యచకితుఁడై)
ఇమ్మణీ। హారము నీగళస్థలి విహారమొనర్చుత శేముషీనిధీ!
(వానిమెడ హారమువైచును.)

రామలింగము:—దీర్ఘాయుష్యమస్తు !

చాకలి:— (లేవఁబోవును.)

రామ:—ఓరీ! నాదీవన పరిపూర్తికానిదే లేవకూడదురా!

చాక:—దీయించండి బాబు దీయించండి, (నేలపైఁబడును)

రామ:—అఖండైశ్వర్యాభివృద్ధిరస్తు! పుత్రపౌత్రాభివృద్ధిరస్తు! గార్దభ సందోహసంసిద్ధిరస్తు !

చాక:—అద్దదీ దీయనంటె అల్లా ఉండాలి. అయిందా బాబూ?

రామ:—మాయాశీస్సుపూర్తమైనది, లేలెమ్ము.

(రామలింగాదులు నిష్క్రమింతురు)

(చాకలి లేచి దుమ్ముదులుపుకొని చేయడ్డఁబెట్టి యథాప్రకారము రాజమందిరిద్వారముకడ నిలఁబడును. కొంతవడికిఁ గ్రోధాగ్నిఁ గురియుచుఁదిరుమల సాయుధహస్తులగు వీరులను వెంటనిడుకొని)

రండు! రండు! రాయలు వంటయింటికుందే లెందుఁబోఁగలఁడు? కోటలోనుండి దాఁటిపోకుండ నుక్కుమీఱిన యుర్వీపతిని బమ్మ తేఁడగు తిమ్మరుసును బట్టి కట్టివేయుఁడు, ఆ దాసీపుత్రునిఁ బట్టి

బంధింపుఁడు. ఓరీ ! కులపాంసనా ? కృష్ణరాయా ! ఇప్పు డెందుఁ బోయెదవు? సైనికులారా?

చ. తములపుటాకు పెట్టెఁదలఁదాల్చినయాతఁడు కృష్ణరాయ లా
కుమఱుఁగుపిండె తిమ్మరుసు కోవిదచంద్రుఁడు ప్రక్కనున్న వాఁ
డములకవిత్వనిస్తులితు లండను నిల్చినవారు మీర లా
క్కమొగినిఁ బట్టి కట్టుఁ డిదె త్ర్యంబకలనాథుని వానిమంతిరిక.

(గుమ్మము సమీపించి నలుదిక్కులుఁబరికించి) ఎవ్వరును గానరా రిదియేమి? ఓరీ! చాకలీ! పండ్లి వారందఱు నెక్కడరా?

చాక:—(దండము పెట్టి) నాచేతిక్రిందనుంచి దూరెల్లిపోయారు తల్లీ!

తిరు:—ఛీ! అందరు వెల్లినారురా ?

చాక:—సిత్తంతల్లీ సిత్తం, జేమ్మలు గీమ్మలు ఒక రేంటి అందరూ.

తిరు:—ఓరీ! మూర్ఖా! రాయలుగూడ నీచేతిక్రిందనుండి దూరివెళ్లెనా?

చాక:—ఆ రెవరో నేనేం ఎఱుగుదును తల్లీ! రాయలువోరు అసలే రాలేదనుకున్నారే పెజలు.

తిరు:—(కత్తిఝళిపించును) ఛీ! నీచుఁడా! నీపనిని నీవు సరిగా నిర్వర్తించినట్లు లేదు. నీకు నియోగించిన పనియేమి? చేసిన దేమి?

చాక:—(వణకుచు) బే... బే...మ్మకు నాకు దండం యెడితే ఓగా యిత్యంఅని ఆయుచ్చిణమని ఆయనపాదాలమీద చాట్టాంగంగా పడ్డాను తల్లీ!

తిరు:—ఆ! ఏమి? (యోజించి, తలపంకించి) అటులనా ? ఔరా? (పెదవివిఱచి) ఇది యెత్తునకుఁబై యెత్తయ్యెనే!

చాక:—నే సూస్తే ఎత్తేద్దును తల్లీ !

తిరు:—ఛీ ! అసంబద్ధప్రలాపీ ! నోరు మూసికొనుము.

చాక:—బుద్దొచ్చింది బుద్దొచ్చింది. రచ్చించు తల్లీ! రచ్చించు(సాష్టాంగనమస్కారము చేయును )

తిరు:—(కోపముతో) యోధాగ్రేసరులారా! ప్రయత్నము! వ్యర్థము-నిష్ఫలము-నిరుపయోగము-మీరుపొండు.

(సైనికులు నిష్క్రమింతురు.)

తిరు:—చేపట్టినపనులన్నియు నారుమూడగుచున్నవి. ఈఘనకార్యమున కీ దౌర్భాగ్యునేల నియోగింపవలె. నీచునిఘనకార్యములం దెప్పుడును నియోగింపరాదు.

ఉ. అల్పున కల్పకార్యముల యందె నిరంతరబుద్ధి కృత్యముల్
సల్పెడుపట్ల మే ల్చెడుగు జూడఁదలంపఁడు రాజకార్యసం
కల్పములందు నున్నతులెశా తగువారు సముద్ధరింపగాఁ
గల్పనఁజేయరాదు ఘనకార్యము లెన్నఁడు నల్పజాతికిన్.

నాప్రతిన కింతటితో స్వస్తిచెప్పుదునా? నాతండ్రి పగదీర్ప కూరకుందునా! (యోజించి) వారు నన్ను విజయనగరమునకుఁ గొంపోదురు. రాయలను జంప కూరకుండినచో గజపతికడుపుఁ జెఱుపఁ బుట్టినకన్నెనని నన్ను జనులు నిందింపరా! చెలిమిని విషమునైనఁ ద్రావింపవచ్చు. బలిమినిఁ బాలైనఁద్రావింపలేము గదా! కావున విజయనగరమునకుఁ బోయిన పిదప రెండవకంటికిఁ దెలియరాకుండ నా సకలప్రయత్నము లొనర్చెద. ఓ కరవాలమా! నా కార్యపరంపరలకు సహాకారివి కమ్ము.

(నిష్క్రమించును.)

---

## నాల్గవ రంగము

(తిరుమలకొఱకు నిర్మింపఁబడిన గుడారము - ఆ గుడారమున గజపతి యొకమూలఁ బీఠస్థుఁడై యుండును.)

(తిరుమల ప్రవేశించి) ఔరా! రాజకీయములు తొందరగా నున్నవఁట. విజయనగరము చేరినఁగాని మాకు రాయల దర్శనము

గాఁజాలదఁట. ఈ గుడారము మాకొఱకుఁ బ్రత్యేకముగా నిర్మింపఁ బడినదఁట. (కలయఁజూచి) హొంబట్టు పుట్టంబులచే నిర్మింపఁబడిన యీగుడార మెల్లెడ నవరత్నఖచితమై ధగద్ధగాయమానమై ప్రకాశించుచున్నది. పెక్కు కక్ష్యాంతరములు కల్గి వస్త్రదుర్గమా యన నొప్పుచున్నది. గుడారములే యిట్లుండ రాయల యంతఃపురంబు లెంత శోభాయమానంబులో కదా! (అటు తిలకించి) ఆ! ఆమూల పీఠంబునఁ గూరుచున్న యాపురుషుఁడెవరు! హా! తండ్రీ! (కౌగిలించుకొని కన్నీరుగార్చుచు) గజపతివేనా! నాయనా! జీవించి యుంటివికదా? పోనిమ్ము.

గజ:—అమ్మా! విచారింపకుము. నే నిందుబంధితుఁడను.

తిరు:—బంధితుఁడవా? ఇచ్చటి కెట్లువచ్చితివి?

గజ:—బిడ్డా! విధి యవిలంఘనీయము. పాత్రుల ఘోరకృత్యముఁదలంచి రాత్రి కోటదాఁటి పంచకల్యాణిపైఁబోవుచుండ రాయల సైనికులు నన్నొంటిపాటునఁబట్టి నాయుష్ణీష మొకవైపునకుఁ గరవాల మొకవైపునకు విసరివేసి నన్నుఁ గొనివచ్చిరి. ఇదంతయు నాతిమ్మరుసుచేసిన దుస్తంత్రమేకదా!

తిమ్మ:—(గుడారము వెనుక భాగమున రహస్యముగా నిలిచియుండును)

తిరు:—నాయనా! విచారింపకుము. దైవానుకూల్యము లేనప్పు డాపదలు తమంత నవియే వరించునుగదా!

గజ:—తల్లీ! నామూలమున నీ వెట్టియిక్కట్టులకు లోనగుచుంటివి? మేము జీవించియుండియు నీ కష్టములను గనులారఁ జూచుచుండవలసి వచ్చెనుగదా! ఏల యిట్టి యిక్కట్టులు? కృష్ణరాయలు మంచి యందగాఁడే! వానిని వివాహమాడరాదా?

తిరు:—(కోపముతో) కందర్పునికంటె నందగాఁడా?

గజ:—సత్యశీలుఁడుగదా!

తిరు:—హరిశ్చంద్రునికంటెనా ?

గజ:—భక్తిపరుఁడే !

తిరు:—ప్రహ్లాదునికంటెనా తండ్రీ ?

గజ:—బుద్ధిసంపన్నుఁడు గాఁడా !

తిరు:—బృహస్పతికంటె నా !

గజ:—అఖండైశ్వర్యవంతుఁడే.

తిరు:—దేవేంద్రునికంటెనా ? జనకా ! ఎన్నియుండిన నేమి కులము లేనప్పుడు. కులహీనునికంటె ధనహీనుఁడు బలహీనుఁడు గుణహీనుఁడైనను మేలని యుగ్గుఁబాలఁ గఱపిన నీ యుపదేశము నప్పుడే మఱచితిననుకొంటివా ? కాని తప్పని సరిగా వానికి... కాదు కాదు...వాని కత్తికి బాసికము గట్టవలసివచ్చినది.

గజ:—ఆ ! ఆ ! కుమారీ ! ఛీ ! నీవు నాకుమార్తెవుగావు ! తిరుమలా ! దాసీపుత్రునే వివాహమాడితివా ? అఖండకీర్తి వహించిన గజపతివంశమునకు నీవు నేఁటికి మాయనిమచ్చ గల్పించితివా ? ఛీ ! దుష్టురాలా రా ? (మూర్ఛిల్లును)

తిమ్మ:—(ఆశ్చర్యముతో) గజపతీ ! దుర్మతీ ! రాయలతోడి బాంధవమింత యాసహ్యాకరమా ? (తలపంకించి) కాని మ్మొంకను వీరి సంభాషణము లెట్లుమదురునో వినవలయు.

తిరు:—(సేదదీర్చుచుఁ జేలాంచలముతో విసరును.)

గజ:—(మూర్ఛనుండి తేరుకొని) దాసీపుత్రుని......పెండ్లాడిన..... దురాత్మురాలా

తిరు:—తండ్రీ ! విచారింపకుము. ఈతిరుమల నీకును నీ కులమునకును గళంకము దెచ్చునని తలంపకుము.

శా. ఆనూనాస్త్రిని మించి చక్కదనమం దారూఢుఁడౌఁగాక ! ధాత్రీసమ్రాట్టగుఁగాక ! భక్తిపరతన్ దేజస్వియౌఁగాక ! వి

ద్యాసంపన్నుఁడై యానుగాక ! జిత దేవాధీశుఁడౌఁగాక ! యా దాసీపుత్రునితోడఁగూడుదునె ? క్షాత్రం బింత కోల్పోదునే ?

తిమ్మ:—అబ్బా ! ఏమిప్రతిజ్ఞ ! ఎంతసాహసము ? (చేతికంకణముఁ జూచుచు) ఓకంకణ రాజమా ! నాతలంపులన్ని యుఁదలవంపు లైనవా ? ఆంధ్ర రాజ్యసంస్థాపనా మహాశయములన్నియు నాశ నముగావలసిన దేనా ? ఔరా !

గజ:—ఏమి ? క్షత్రికి బాసికమంటివికదా ? పెండ్లి యైనట్లే కాదా ?

తిరు:—తండ్రీ ! మనోవాక్కాయకర్మములలో మనస్సేకదా ప్రధా నము. అప్పుడునీయుపదేశము స్మృతికిఁదెచ్చుకొంటి. మనసా నేనాతని వరింపలేదు. యుద్ధమునకు సర్వము సిద్ధముచేసి సర్వ ప్రయత్నములు నిరర్థక మైనవెనుక నూరకొని వివాహమను నెపంబున నా దాసీపుత్రునిఁగోటలోఁబట్టి బంధింపవలయునని యట్లుచేసితిని. దైవవశమున నది విపరీతమయ్యె. తండ్రీ ! కుల శీలములను బాటింపనంతటిమూర్ఖురాలనా నేను ? పరమపావన మైన క్షత్రియరక్తమును దాసీరక్తముచేఁ గలుషిత మొనర్తునా?

ఉ. ద్వాపరకాలమాది కలిదాఁకను నిప్పటిదాఁక గాఢసం
స్థాపితకీర్తిధామమయి సన్నుతభారతయుద్ధమందు బా
హాపటిమంబుఁజూపి యశమందిన క్షత్రియరక్తధారకుఁ
లోపముఁదెత్తునే జనక ! లోపలితాపము నార్పుమా యిఁకన్.

నాయనా! పరాక్రమధనుఁడగు నన్న వీరభద్రగజపతి రాయల చేత బంధితుఁడయ్యె. నీవును నేనుంగూడ బంధితులమే. ఈముువ్వురి బంధనములనెడు త్రేతాగ్నులను హృదయమున ధరించి భరించి యూర కుందునని యే తలంచితివా? నే ను గా క మాపగఁదీర్చువా రెవరు? నాయనా? రాయల పరిణయమహోత్సవమునకుఁగాదు నేను దరలి

పోవుచున్నది ? మరణమహోత్సవమునకేయని ముమ్మాటికి నమ్ముము ఇక సుఖం బుండుము (చేతిలోఁ జేయి వేయును)

తిమ్మ:—(చెవులు మూసికొని) అయ్యో ! మిన్ను విఱిగి మీఁదఁబడినది. దుస్సహము...దుర్భరము...భరింపఁజాల... (నిష్క్రమించును.)

గజ:—అమ్మాయీ ! తిరుమలా ! రాయలప్రసంగమనిన మీయమ్మకెంత కంటగింపు.

గీ. పెండ్లిమాటలు మీయమ్మ వినుట మొదలు
కంటఁదడిఁబెట్టకుండిన గడియలేదు
గజపతులగౌరవం బింకఁ గన్నతల్లి !
నిలువఁబెట్టుభారంబు నీ తలన నిలిచె.

(తెరపడును)





శ్రీ

# తిరుమలదేవినాటకము

## చతుర్థాంకము

### మొదటి రంగము

విజయనగరము - చింతామణీమందిరము

(శ్రీకృష్ణదేవరాయ లొంటరిగా నుందురు. ప్రక్క బల్లపైఁ దినుబండము లుండును. తిరుమల చిత్రఫలకము గోడకుఁదగిలింపఁబడి యుండును. విశారదుఁడు ప్రవేశించి) చెలికాఁడగు కృష్ణరాయలొక్కఁడే కూర్చుండి యేదియో తలపోయుచున్నాఁడు. ఇప్పుడు మరేమి తలంపున్నది? ప్రాణేశ్వరియగు తిరుమలాంబాప్రశంస తప్ప. రహస్యముగా వినెద (వెనుక నిలచును)

రాయలు:—ఆచిత్రఫలకములోని ప్రతిమకును గళ్యాణమంటపంబునఁ జూచిన తిరుమలకును రవంతయు భేదముగలదా? ఈచిత్రకారుఁడెంత నేర్పరి! కాదుకాదు - ఆచిత్రకారుఁడు పరమేష్ఠి యెంత నేర్పరి? ఇట్టియసమాన సౌందర్యవతిసన్నిహితయయ్యు నాకు సంస్పర్శసుఖంబు గొఱంతయయ్యె. ఆహా!

సీ. ఈదేవతాకాంత పాదయుగ్మముఁగొల్వఁ
గనులవిల్తుం డశోకంబుఁదాల్చె
ఈలేమ రదనంబు నేవేళ సేవింపఁ
గాముండు నవమల్లికను ధరించె

ఈనాఁటి యధరంబు నేవేళ నర్థింప
సుమధన్వి చూతంబుఁ జేతఁబట్టె
ఈకొమ్మ వదనంబు నెలమిమై బతిమాలఁ
గందర్పుఁడరవింద మందుకొనియె
గీ. ఈచెలి కనుల్ గొలువ మరుం డూఁచెఁగలువఁ
గానిచో నన్ను దత్తదంగములగములు
కూడు నుడిగించి వాడించి కొమరుఁగూల్చి
తలఁపు లోనఁగూర్చి స్తంభింపఁదలచునో కో.

(తలపైఁ జేయిడి దృష్టినిఁగ్రిందకు నిగుడించును. అంతలో నెదుటనున్న చిత్రఫలకమును దీసి విశారదుఁడు దాచును)

రాయ:—(తలయెత్తి) ఏమి? నాప్రేయసి మటుమాయమైనదే తిరుమలా! ఇంతమాయలమారివా? (విశారదునిఁజూచి) సాక్షాత్కరించితివా? (విశారదునిఁ గౌఁగిలించుకొనును)

విశా:—వయస్యా! నేను విశారదుఁడనోయి తిరుమలాంబనుగాను.

రాయ:—చెలికాఁడా! విశారదుఁడవు కనుకనే యాపత్కాలమున సాక్షాత్కరించితివాయని కౌఁగిలించుకొంటిని.

విశా:—తప్పించుకొంటివిలే! నీకిప్పు డేమియాపద వచ్చినది? (ప్రక్కనున్న ఫలాహారములనుజూచి) ఈతినుబండములు తినుటయందు నీకు నేను సాయముచేయవలయునా యేమి? అదెంతసేపు? (తినఁబ్రారంభించును)

రాయ:—నెచ్చెలీ! నీకొంటెపనులు నీవు మానవుకదా!

విశా:—నేనేమి కొంటెపను లొనర్చితిని? నీవే కొంటెవు. నేను తిరుమలను కానయ్యా యన్నను నెచ్చెలీ యందువు కౌఁగిలించుకొందువు. ఇదేమి ప్రారబ్ధమయ్యా? పోనిమ్ము. వయస్యా!

నీమన స్సన్యథా లేనియెడల నేను కొన్నిప్రశ్నలు వేసెదను చెప్పుము. ఏదిలేకున్న లోకులు నిందింతురు ?

రాయ:—నీతి

విశా:—పంచభూతములలో రెండవది యేది ?

రాయ:—ఆపస్సు

విశా:—ఆపస్సా గీపస్సా? తెనుఁగు భోజుఁడవై యుండి తెనుఁగుపదము చెప్పవలదా ?

రాయ:—(నవ్వి) నీరు.

విశా:—కూడఁబెట్టుటలో మానవునకు సైతము బుద్ధిచెప్పు జంతువేది ?

రాయ:—(చిరుహాసముతో) ఇవియేమి శల్యప్రశ్నలా యక్షప్రశ్నలా. ఈమాత్ర మెఱుంగనా? చీమ.

విశా:—ఏదియబద్ధము ?

రాయ:—కల

విశా:—వయస్యా! చక్కఁగాఁ జెప్పితివి. కాని చివర తప్పితివి.

రాయ:—కల యబద్ధముగాదా? మరి యేదియబద్ధము ?

విశా:—నీవుచెప్పిన నాల్గుపదములలో నంత్యమాక్షరము లేవి చెప్పు.

రాయ:—నీతిలో 'తి' నీరులో 'రు' చీమలో 'మ' కలలో 'ల' (పెద్ద నవ్వుతో వానినిఁదట్టి) ఆ! నాకు నాప్రేయసియగు తిరుమలను జక్కఁగా స్ఫురింపఁజేసి యమందానందమును గూర్చితివి. కాని (కోపముతో) ఓయీ ? అబద్ధమంటి వదేల ?

విశా:—వయస్యునకుఁ గోపమువచ్చినదా ? అబద్ధమనఁగా లేదన్న మాట. ఇంతవఱకు నీ యెదుటనున్న తిరుమల నాచేతనున్నది. (చిత్రఫలకముఁజూపి) ఇదిగో ! (గోడకుఁదగిలించును)

రాయ:—వయస్యా ! నీవామెను జూచితివా ?

విశా:—ఇదిగో ! చూచుచునేయుంటిని. గోడమీఁదాబొమ్మ! గోలుసులా బొమ్మ......

రాయ:—ప్రత్యక్షముగాఁ జూచితివా?

విశా:—ఒకసారికాదు. రెండున్నరపర్యాయములు చూచితిని.

రాయ:—(నవ్వి) అదెట్లు పొసఁగినది?

విశా:—అది పొసఁగినదీ! అమ్మగారి కేదోవ్రతమున్నదఁట. తిమ్మరుసుగారికిఁ గబురంపఁగాఁ గబురంపగా దానముపుచ్చుకొనుటకు బ్రాహ్మణుని దీసికొనిరమ్మని యామె యాజ్ఞాపింపఁగా నన్ను యమధర్మరాజుగారి దగ్గరకు వలెఁ దీసికొనిపోయిరి. గుమ్మములో విచ్చుకత్తులవారు లోపల విచ్చుకత్తులవారు నా పక్కను యమభటులవలె విచ్చుకత్తులవారు (కనులుమూసికొనియేడ్చును) తిరిగివచ్చినన్ను మరలఁచూచెదనని యనుకొనలేదు. ఇట్లు రెండుపర్యాయములు జరిగినది. మూడవసారి సగముదూరము వెళ్ళి తిరిగివచ్చితిని. రెండున్నర కాలేదా మఱి. రాచదానములు పట్టఁగూడదురా బాబూ యని యిదిగో యిట్లు (చెంపలువేసికొనును) చెంపలు వేసికొంటిని.

రాయ:—(నవ్వి) మిత్రమా! నీవు పోవునరి కామె యేమి చేయుచున్నదో చూచితివా?

విశా:—చూడనూ! కన్నులు మూసికొందుననుకొంటివా? అట్లైన గ్రుడ్డివాఁడనై పోనూ! గ్రుడ్డివాఁడు దానపరిగ్రహమునకుఁ బనికిరాఁడని నేనెఱుంగనా? అక్కడ నీవిగ్రహమున్నది. ఆమె నీవిగ్రహమును సేవించుచున్నది-ఔషధమువలె-

రాయ:—నీయుపమానముకూల! ఇదియేమియుపమానము?

విశా:—ఔనయ్యా! నీ విగ్రహము నెదుటఁబెట్టుకొని ధ్యానము చేయు నామె మగ్నహృదయయైయుండఁగాఁ గనులుమూసినను నీవే కనుపింపఁగా నిన్నాత్మలో నైక్యముచేసికొనుచున్నది.

రాయ:—ఆమెవర్తనమునకు మెచ్చితి. ఈ ప్రేమాంచితమైన కానుకలామె కందించి వత్తువా? (హారముఁదీసి యీయఁబోవును)

విశా:—నేనిట్లె నను బ్రదుకుటకు నీకిష్టములేదా యేమి ?

రాయ:—అదేల ?

విశా:—తిమ్మరుసునాజ్ఞలేనిదే పోతుటీగకూడ నాగుమ్మమును దాటరాదు. తిమ్మరుసు నీపాలిటఁగుబేరుఁడు. కుబేరశాపముచే నీచిత్రకూటమందొంటరిగానున్న యక్షుఁడవు నీవు.

రాయ:—అట్లైన నీవు ఘనసందేశముఁ గొనిపోరాదా ?

విశా:—సౌధాగ్రమునకైనఁ దిమ్మరుసు నాజ్ఞలేనిదే యా తిరుమల రాఁగూడదఁట. నేనెంతఘనుఁడనైననేమి ? కాదుకాని నాకొకయుపాయము దోఁచుచున్నది. ఘనునివలె ఘనకార్య మొనర్పలేను గాని నేను చీమనై ప్రాఁకిపోయెదను. ఈగనై యెగిరి వెళ్ళెదను. కుక్కనై లోపలఁజొఱఁబడెదను. వయస్యుని కార్యముకొఱ కేపనియైనను జేయఁగలను.

రాయ:—(నవ్వి)వయస్యా ! ఈయవతారము లెట్లెత్తఁగలవు ?

విశా:—నా చెలికాఁడు కరండవాహకుఁడైనట్లే. హరి వరాహము కాలేదా ? ఇంతకును జేతగానిమంత్రి దొరకిన నిట్లేయుండును. నీవు వానిఁగొంచెమైన నదలించి పలుకలేవు. ఈమధ్య నే నెన్ని ఘనసన్సంధానముహూర్తములు పెట్టించితినో లెక్కలేదు. ఇంతమందికిఁగుదురగా మూఁడుమాసములనుండి ముహూర్తమే కుదురలేదా నీకు.

రాయ:—ఈవిషయ మప్పాజితో రెండుమూఁడుతడవలు ముచ్చటించితిని. ఆతఁడు పెడచెవినిఁబెట్టి కాలయాపనము చేయుచున్నాఁడు కారణమేమో కానరాదు.

విశా:—కారణమేమి ? ఆలస్యము చేయవలయునని చేయుటయేతప్పు.

రాయ:—ఔను ఛూడఁజూడ నాకును నిది వింతగాఁగన్పట్టుచున్నది.

చ. కరిపతికోటఁగొట్టి గజగామినిఁదిర్శలఁబట్టి రెన్నెలల్
జరిగెను జూడనీయఁడొకసారియు నామె సురూప మద్దముౕ
గరమునఁగీలుఁగొల్పి వదనంబును జూచుకొనంగనీయఁ డ
బ్బురమునుహాస్యమున్ గినుకఁ బుట్టఁగఁజేయు నమాత్యుకృత్యముల్

విశా—వయస్యా! అద్దము తిరుగవేసి చూడుముతిరుమల కన్పట్టును.

రాయ:—నీమతిమాలినమాట లింక కట్టిపెట్టుము.

విశా:—కట్టి... పెట్టితినిలే. నీకు తిరుమలనాలోఁగాన్పించెఁగదా గోడ మీఁద బొమ్మలోఁగన్పట్టెనుగదా గాలిలో గంగలో నంత టను గన్పించుచున్నదిగదా యద్దము తిరుగవేసి చూచిన గన్పించదటయ్యా ?

రాయ:—వేయేల? మిత్రమా! ఏమైననుసరే. నేఁ డీవిషయముఁదీవ్ర ముగా మంత్రితోఁ బ్రసంగించితీరెద.

విశా:—నే నాతనికొఱకుఁబోయి తీసికొనివత్తునా?

రాయ:—సఖా! సఖా! పోయి సత్వరము రమ్ము.

విశా:—ఆ! ఆముసలితాతను జూచిన నాకు భయముబాబూ! నేను పోను—పోనిమ్ము - చెలికాడవుగదా పోయివచ్చెదను (రెండడుగులు ముందువైచి వెనుకకుఁదిరిగి) వయస్యా! వయస్యా! తలఁచు కొనుటయేతడవుగా దయ్యమువలెఁ బ్రత్యక్షముగాఁగలఁ డా మంత్రితిమ్మరుసు. అడుగో వచ్చుచున్నాఁడు.

(తిమ్మరుసు ప్రవేశించును)

రాయ:—అప్పాజీ! దయచేయుఁడుఁ

తిమ్మ:—(ఆసనాసీనుఁడగును.)

విశా:—(ఇరువురముఖములను జిత్రముగాఁదిలకించును).

తిరు:—ఓహో! ప్రభువులు తిరుమలాంబా చిత్రఫలకావలోకనమునఁ గుతూహలాయత్తచిత్తులైనట్లు తోచుచున్నది.

విశా:—అవలోకనమేమి ? అయ్యవారికంతా రామమయమే యైతే.

రాయ:—(విశారదునివైపు కోపదృష్టి నిగుడ్చును)

విశా:—తిమ్మరుసుగారూ ? మీకు వేయి నమస్కారములు. మా వయస్యుఁడు నాపై కోపగించుచున్నాఁడు. నేఁ బోయెద.

తిమ్మ:—(నవ్వి) విశారదా ? నీవు నీ చెలికాని నోరూరించుటయం దెంతయు సహకారివి. పోవలదు-కూరుచుండుము.

విశా:—ఆజ్ఞ! కూర్చుండెదను. (నేలపైఁ జతికిలఁబడును) కాదాసనము పైఁ గూర్చుండెద. (లేచి యాసనమునఁ గూర్చుండును)

రాయ:—అప్పాజీ !

గీ. చిత్రములు వ్రాయ నేర్పరి చిత్రమందు
నుత్తమకుల ప్రసూనంబు నొత్తివ్రాయు
అట్టి సుమమున కామోద మెట్టు లబ్బు
భృంగము మరందపాన మెబ్భంగిఁజేయు.

విశా:—తిరుమలాంబను దెచ్చి యింటఁబెట్టి యనుభవయోగ్యనుగాఁ జేయలేదనుటకదా యిది ?

తిమ్మ:- గీ. వ్రాయుటొక్కటియే శిల్పివంతుగాని
మంచిచెడ్డలఁజాల గుర్తించి చూచి
సహజకృత్రిమ భావయోచనము నేరు
పధిప! మధుకర ప్రభునిదే యగునుగాదె?

విశా:—మంత్రిగారు నిజము సెలవిచ్చినారు

రాయ:—గీ. ఇంతకాలంబు పట్టునే యిద్ధచరిత !
పూవుపుట్టినతోడనే తావి పొడము
ననెడుసామెతకు విరుద్ధమును ఘటించి
తరయఁగల్గుట చేరినయపుడుగాదె!

తిమ్మ:—ప్రభువులసంభ్రమము గ్రహించితినిమాహూర్తికులరావించితిని కాని నిశ్చయమయమునఁగాని ముహూర్తముకుదురకున్నది అంతఃపురమంతయు నలంకరింప నాజ్ఞాపించితి. దైవజ్ఞులు రవుసుముహూర్తముంచిరి. నేటినుండియు దేవిగారి నలంకరించుచున్నారు.

విశా:—ఈసంగతి తొలుతనే చెప్పరాదా? పోనిండు ఎప్పుడైననేమి! చావుకబురు చల్లగా నన్నారు. పెండ్లికబురు మెల్లగానన్నారు.

రాయ:—ఛీ! మూర్ఖా! స్థానాస్థానములు సమయాసమయము లెఱుంగక ప్రేలెదవు?

తిమ్మ:—(తనలో) ఈవిశారదుఁడు విశారదుఁడే కావలయు. (ప్రకాశముగా) అదియుంగాక తిరుమలాంబయే యిది కాదని యది యది కాదని యిది వింతవింత యలంకారములను స్వయముగానే కైసేసి కొనుచున్నదని తెలియవచ్చినది.

రాయ:—సహజసౌందర్యవతులకన్నియు నలంకారములే కదా!

విశా:—ఆ! సహజపరాక్రమశాలులకు ఖడ్గ మలంకారముగాదా! వయస్యా! నీవు పెండ్లికొడుకవైతివి, చూడు (తనమెడలోని హారమును దీసి రాయలమెడలో వేయును)

తిమ్మ:—ప్రభూ! నేనింకను సంభారములను సమకూర్పఁబోవలయు సెలవొసంగుఁడు.

రాయ:—మంచిది.

తిమ్మ:—(నిష్క్రమించును.)

విశా:—వయస్యా! మాతల్లిని రెండుదినములలంకరించిన నిన్నొకకూట నలంకరించెదరమ్ము (తీసికొనిపోవును.)

(అందఱు నిష్క్రమింతురు)

## రెండవ రంగము

(అంతఃపురములో విశాలమైనగది - సర్వాలంకృతమైన మంచముపై గృష్ణరాయలు చక్కని రవసెల్లా కప్పుకొని పరుండును. ఒక వచ్చి నిద్రించురాయలను దవ్వులనుండి పరికించి వెడలిపోవును - సర్వాలంకారభూషితయై తిరుమల ప్రవేశించును)

తిరుమల:—ఇది మాయింటి యాచారమని చెప్పి తంతులన్నియు మాన్పించితి. రాయలు నిద్రించుచుండెనని చెలికత్తె యిప్పుడే చెప్పినది. ఆహా! పౌరుషంబునకు దైవంబు తోడ్పాటు లేనిదే యేకార్యమును ఫలింపదుగదా! కావుననే తొల్లింటి ప్రయత్నములన్నియు వ్యర్థములైనవి. సఫలములగుకార్యములకుశుభసూచనలు తొలుదొల్తనుండియుఁ బొడగట్టుచునే యుండును. లేకున్న రాయ లిప్పుడు నిద్రింపనేల? వెండియు నీవెంకిగిన్నెయం దుంచిన మత్తుపదార్థముతో నిండిన మధురపాయసము నీతఁడు త్రాగివేసినాఁడు. నాపూన్కికిఁదోడుగా నేఁడు నిశాసమయ ముహూర్తము కూడఁ గూడె. (నిరూపించి) ప్రభూ! ప్రభూ! (ఆలకించి) సెబాస్! ఇదియు మేలయ్యె, ప్రభూ! ప్రభూ! (తలపంకించి) పాయసము పనిచేసినది. నిద్రాపరవశుఁడు! (చిరునవ్వునవ్వి) నృపాలాధమా! నేఁ డెందుఁబోఁగలవు? అప్పుడుగా దిప్పుడు వంటయింటికిం దేలవైతివి. తిరుమల గగనకుసుమమని యెఱుంగవా? నన్ను గూడి స్వప్నావస్థఁగుల్కుచుంటివికాఁబోలు! ఔను.కలలో ననుభవింపలేనిభోగములుగలవా!

సీ. దివిజలోకముఁజేరి దేవేంద్రుగద్దెపైఁ
బెంపు నింపుచునుండు భిక్షుకుండు
పెనుగొండపాడవై నధనరాశి కనదిగాఁ
దలపోసి కులుకు నిర్ధనజనుండు

మగువలం దవతంసమగు రంభ రమణీయు
పరిరంభమునఁజొక్క బ్రహ్మచారి
గగనచుంబితహర్మ్యకాంచనడోలికా
విహరణంబునఁదేలు పేదరాలు

గీ. గండపెండేరరవము డాకాలియందు
ఘల్లుఘల్లున మ్రోయ దిగ్గజము నెక్కి
యల్లసల్లన నూరేగుఁ బిల్లకవియుఁ
గలలఁబొందఁగా రానిభోగములు గలవె !

మ. అటులే పాపము నీవుగూడఁ గలలో నయ్యారె ! నన్గూడి మ
త్పటుబాహాపరిరంభగుంఫితమహాభాగ్యాబ్ధి నోలాడు దే
వెటులో ర్తుఁ గలనైన ముట్టుటకు నోరీ ! నీచజాతుండ మ
చ్చటులాభీలనిశాతఖడ్గహతిచేఁ జల్లార్తుఁ గ్రోధాగ్నులన్.

(ఒడినుండి కత్తి లాగును) ఓయీ ! నాచిత్రఫలకము నెట్ట యెదుటఁ బెట్టుకొని మురియుచుంటివికాఁబోలు. ఛీ ! నీహస్తసంస్పర్శనమున నాచిత్రఫలకముగూడ దూషితమైనది. (తీసిపారవేయును) దాసీపుత్రుఁడవగు నీవా నన్ను వివాహమాడుట ! నీవు నిజముగా హీనకులజుండవే !

సీ. కత్తిఁబట్టఁగలేక కడకు లంచం బిచ్చి
పాత్రుల విడఁదీయఁ బౌరుషంబె
అసహాయుఁడై యున్న యవసరంబును గాంచి
మాతండ్రిఁ జెఱఁబట్ట మగతనంబె
కోటఁబట్టెదమంచుఁ గుటిలవార్తల నంపి
రణమన్న వెనుదీయ రాచతనమె
నిన్నొల్లనని పల్కు కన్నెమిన్నను నన్ను
బలిమిఁ బెండ్లాడంగ బంటుతనమె

గీ. క్షత్రియోచితకార్య మొక్కటియు నైనఁ
గంచుకాఁగడాల్చేసినఁ గాననగునె
హీనకులజుఁడవంటకు నిన్ని కూడ
మంచితార్కాణములుగావె యెంచిచూడ.

భరింపఁజాల ! భరింపఁజాల ! గుడారమున బంధితుఁడైన నా తండ్రి దీనావస్థ దలంచిన నాగుండె తఱుగుకొనిపోవుచున్నది. దుర్భేద్యమగు కోటమాట దలపెట్టిన దుఃఖము పొంగి పొరలి వచ్చుచున్నది. క్షత్రియరక్తము దాసీరక్తస్పర్శచేఁ గళంకితముఁజేయ సమకట్టిన రాయలపేరు తలపెట్టినంతన యొడలు భగ్గుభగ్గున మండిపోవుచున్నది. నే నానాఁడు గుడారమునం దగుపించినంతనే నన్ను గౌఁగిలించుకొని దుఃఖించినతండ్రి నేరీతి మఱతును !

గీ. "గజపతులగౌరవం బింకఁ గన్నతల్లి !
నీ తలన నిల్చెగానని కంట నీరుపెట్టు
కొనుచు నాతండ్రి పలుకఁగా వినిన నేను
పగఱ సాధింప కేరీతి బ్రతుకనేర్తు !

దండెత్తివచ్చినప్పుడే కాక బలోపేతుఁడైనప్పుడే కాక నిద్రావస్థనున్నప్పుడును శత్రువును వధింపవచ్చుననికదా మున్నశ్వత్థామ సిద్ధాంతము చేసెను. సిద్ధాంతమేమి ?

గీ కూర్కు గను కాకుల వధించి గుడ్లగూబ
నాఁడు గురువయ్యె ద్రోణనందనున కెలమి
నేఁడు నిద్రించు రాయల నిధనకృతికి
ద్రోణసుతుఁ డాతఁడే నాకు దొడ్డగురువు.

(యోజించి) నిద్రించు రాయలను బొడిచి చంపుట యుద్ధధర్మము కాఁజాలదా ?

ఆ ! ఏమంటిని ? అధర్మమా ! అధర్మము ! కానేరదు. ఇది పరమధర్మమే యగు.

చ. అనుపమనీతిశాస్త్రవిదుఁ డాహవధర్మపరుండు ద్రోణనం
దనుఁడు గుడారమందు ద్రుపదప్రభుపుత్రుఁడు నిద్రపోవుటన్
గని తల ముక్కముక్కలుగ ఖండనచేయఁడె యొట్టులేనియున్
జనకుని సూడు దీర్చుటయె క్షత్రియధర్మము శూరధర్మముల్.

కులహీనుండగు రాయల సంస్పర్శచే నిక్ష్వాకులనాటినుండి పరమపావనమైన యీ క్షత్రియరక్తధారను గళంకితముచేసి లోక మున్నంత దాఁక నామూలమున గజపతివంశమున నప్రతిష్ఠ కలుగఁ జేయుదునా ?

గీ. ప్రాణ మస్థిరంబును క్షణభంగురంబు
ధరణి మానంబె యాచంద్రతారకంబు
కానఁ బ్రాణముఁ ద్యజించియైన మాన
మిపుడు కాచుకొని యశ మార్జించుదాన !

హింస! హింస! ఇదిహింసకాదా! దీన నాకధోగతి గలుగదా? నరహింస! ప్రభుహింస! నాకు నరకము రాదా? (ఆలోచించి - నవ్వి) నరకమా! రానిమ్ము!

చ. నరకము వచ్చుఁగాక! నరనాథులు నవ్వగవచ్చుఁగాక! దు
ర్మరణము గల్గుఁగాక! విసుమానముగా జగమెంచుఁగాక! దు
ర్భరగతి గల్గుఁగాక! తలపై నభముం బడుఁగాక! యిప్పుడీ
ధరణిపునిం గులాధముని దర్పితుఁ జంపక యూరకుందునే!

మత్పితృకరాంచిత నిశాతఖడ్గరాజమా! కృతకృత్యావు కమ్ము. (మంచమును సమీపించి కృష్ణరాయలకుత్తుకలో నొక్కపోటు పొడుచును. రక్తముచిందును. రాయల కాలుసేతులు తటతట కొట్టుకొనును. తిరుమల క్రిందఁబడి మూర్ఛనొందును)

(మంచము వెనుకఁ దెరచాటునుండి రాయలుఁ దిమ్మరుసును వెలికివచ్చి ప్రవేశింతురు)

రాయ:—(పండ్లు పటపట కొఱుకుచు నొరనుండి ఖడ్గము నూడఁ బెఱికి) అప్పాజీ! సహింపఁజాల! మేకవన్నెపులి యీకలికి! తేనెపూసినకత్తి యీబిత్తరి! సహింపఁజాల! ఇప్పుడే యీ బ్రహ్మరాక్షసిని కర్ణాట సామ్రాజ్యలక్ష్మిని దిగమ్రింగుటకు బాఁపరించిన యీమహామారినిఁ జీల్చిచెండాడెద. (ఉఱుకఁ బోవును)

తిమ్మ:—(కత్తిగలచేయి పట్టుకొని నిట్టూర్పు విడుచుచు) కుమారా! తొందరపాటువలదు. శాంతింపుము. (తలయూచి) ఈకుసుమ కోమలాంగి కింత కర్కశహృదయమా! ఈసౌందర్యరాశి కింత క్రూరస్వభావమా! ఈ యుత్తమకులసంజాత కింత ద్రోహ చింతనమా! ఇది ప్రకృతివిరుద్ధము! ప్రకృతివిరుద్ధము! ఇదం తయు నీమె బుద్ధిపూర్వకముగా నొనర్చినదికాదనుట నిర్వి వాదము.

కృష్ణ:—(క్రోధముతో)కుసుమకోమలాంగియట. అప్పాజీ! మీమాట లెంతవింతగా నున్నవి? ఐనది కాదని, కానిది యౌనని వాదిం తురు. ఇది మార్జాలశీలన్యాయముగా నున్నది. దీనిని నమ్మఁ జాల! నమ్మఁజాల!

తిమ్మ:—వేగిరపాటు వలదు. గోక్షీరన్యాయమువలెనీవిశాలాక్షి మీ మైత్రికతంబునఁ బవిత్రురాలు కాఁజాలదా? జగత్సముద్ర మెల్ల మధింపగా సకలరాజ్ఞీలక్షణములుగలయీ బాలికామణియొక్క తెయే లభించినది. ఎన్నెన్ని యాశ్రమలుపడి కొనివచ్చితిమి. మృత్సంపర్కముగల గనినుండి తెచ్చినతోడనే యెంతజాతిరత్న మైనను ప్రకాశించుచున్నదా! కల్మషము నంతయుఁ బోఁదోమి

సానపెట్టి బంగారంబునఁబొదివినవెనుకఁగదా ధగధగాయమాన మగుట (చేయెత్తిచూపి) రాజేంద్రా! ఈమెనుమీకు మిక్కిలి ప్రేమాస్పదురాలగుభార్యగాఁ జేసితీరెదనని యిదేకంకణము గట్టుకొంటిని. నాచెప్పినచొప్పునఁ బ్రవర్తింపుఁడు. ఆదర్శమలిన న్యాయమున నీమె హృదయమునఁ బుట్టిన మలినము నులువుగాఁ బోవునదేకాని స్థిరముగా నిల్చునది కాదు. మీకిప్పుడే తెలియఁగలదూరక చూచుచుండుఁడు.

కృష్ణ:—అప్పాజీ! మీకుఁ బిచ్చియెత్తినదా యేమి. కాదు! కాదు! మంత్రిశేఖరా! మీమాట కడుగుదాఁటఁజాల. ముహూర్తనిర్ణయమునకే యింతయాలస్యమా యని యానాడు మిమ్మధిక్షేపించి మాటాడినయపరాధమునకే లజ్జించుచుండఁగా నిప్పుడింకొక యపరాధమా! పీరావేశమున నట్లంటి.

అప్పా:—కుమారా! అది ప్రకృతివికారము పోనిమ్ము.

రాయ:—అప్పాజీ! మీకుఁగల మానవమనస్తత్వవిచారణా సామర్థ్యము నశేషశేముషీవిశేషము నాచాణక్యాదులకె నఁగలదా! ప్రాణములున్నరీతిఁ జేష్టలుగల్గినభంగి ననమాన శిల్పవిద్యాప్రావీణ్యంబెసలార నావిగ్రహము రెండుమాసములలో సిద్ధము చేయించి యి ట్లీసంవిధాన మవధానచాతురి మెఱయనొనర్చి నాకు మరియొకసారి ప్రాణదాన మొనర్చిన మి మ్మెమని నుతింతును.

అప్పా:—తండ్రి కుమారునిఁ గాపాడుకొనుట యొక యబ్బురమా! నా చెప్పినరీతిఁ బ్రవర్తించిన సర్వాభీష్టము లా పరమేష్ఠిదయఁ జేకూర్చఁగలవాఁడ! (అటుపరికించి)

తిమ్మ:—ఆమె మూర్ఛనుండి తేరుకొనుచున్నట్లున్నది. కొంచెము కదలిక గన్పట్టెడిని. నడువుఁడు మఱుగునకు.

కృష్ణ:—(వెనుకకుఁబోయి మఱుగున దాఁగియుండును)

(తిరుమల మూర్ఛనుండి తేరుకొనునంతలోఁదిమ్మరుసు మంచము మీఁదనున్న కృష్ణరాయలవిగ్రహము నంతర్హితమగునట్లును మంచముపై నొక్కబొట్టు రక్తముగూడఁ జిందని చందమునను మార్పుచేసి వెనుక దాఁగియుండును.)

(తిరుమల కొంచెము తెలివివహించి విభ్రమముతో) ఈరక్తధారలేమి! ఈవధయేమి! నేనా! వధించితినా! రాయలనే!భర్తనే వధించితినా! (క్షణము యోజించి) రాయలు - రాయలు – నిష్కళంకుఁడు! నిర్మలాత్ముఁడు! దుష్టసంహారార్థ మవతరించిన మహానుభావుఁడని కోటలో నెంద రెందరో చెప్పఁగా వినియుంటిని. మహానుభావుఁడుకానీ హీనభావుఁడుకానీ భర్త భర్తయేకదా! ఎట్టివాఁడైననేమి! కోపానలదందహ్యమానమానసనై యుక్తాయుక్తము లెఱుంగక యెంత సాహసమొనర్చితిని! సాహసకార్యమా! ఎంతతుచ్ఛకార్య మొనర్చితిని! భర్తనుజంపినపాపాత్మురాలను నేను. (మంచముమీఁదినాథునిఁ జూడఁబోయి కన్నెత్తి) ఈపాపాత్మురా లామహాత్ము నెట్లుచూడఁ గలదు! నాథా! నాథా! ఈపాడువదన మమృతధారలు గురిపించు చంద్రమండల మనుకొంటివిగాని నిరంతరనిబిడీకృతాగ్నిజ్వాలలనుగ్రక్కు నగ్నికుండమని యెఱుంగవైతివి. ఈపాడుకన్నులు సంఫుల్లాసితోత్పల పత్రము లనుకొంటివిగాని భవత్ప్రాణహరణనిర్మితాయఃపత్రములని తెలియవైతివి. ఈపాడువాతెఱ డంబుగడించు పగడంబనుకొంటివిగాని ముట్టినం గాల్చి నకనకలాడు నఖండాగ్నిఖండంబని యెంచవైతివి. ఈదుష్టబాహువులు మిసమిసలాడు బిసదండకాండము లనుకొంటివికాని భయంకర యమకింకరపాశంబులని యూహింపవైతివి. ఈకృత్రిమ సౌందర్యరాశి యసమానామృతభాండం బనుకొంటివిగాని పయోముఖవిషకుంభమని తలఁపవైతివి. ఇట్టితుచ్ఛురాలిని, నిట్టినీచురాలిని,

నిట్టిదురాత్మురాలిని నమ్మి యెంతమోసపోతివి ! ఓదేవతలారా ! ఇంతంతదురంతకార్యములొనర్చు రాక్షసినిఁజూచుచు నూరకుందురేల!

ఉ. కోపముచే వివేకమును గోల్పడి వట్టియమాయకుండు నే
పాప మెఱుంగనట్టి నరపాలశిఖామణిఁ జంపి యయ్యయో
పాపము మూటఁగట్టితిఁ గృపాపరులార ! శపించి యిప్డు డీ
పాపినిఁ జంపి లోకపరిపాలనఁజేయరె మీకు మ్రొక్కెదన్.

(లేవఁబోయి నేలపైఁ గూలి) ఈపాపపుఁగనుల నెట్లు పైకెత్తి చూడఁగలను ! ఈకన్నుల నూడఁబెఱుకుకొందునా! ఓపాదుహస్తమా! నిన్నేమిచేసినఁ బాపమున్నది ! తుండెతుండెములక్రిందఁ దెగనఱుకుదునా ! ఓపాషాణహృదయమా ! నిన్ను పిండిపిండిగా బ్రద్దలుగొట్టినను దోషమున్నదా ! తిరుమలా ! తిరుమలా ! నీకు హృదయమునది కలదా ! లేదు లేదు (కన్నీరుగార్చుచు) అక్కటా ! నే నెంత పాపాత్మురాలను !

సీ. మానవోత్తములందు మహనీయుఁడగు వీని
నకట ! తునిమి నరహంత్రినైతి
కర్ణాటసామ్రాజ్యకార్యపీశ్వరుఁ ద్రుంచి
యయ్యయో ! యిట రాజహంత్రినైతి
ప్రజలసంతతికెల్ల రంజనం బొనరించు
నధిపుఁ జంపుచు లోకహంత్రినైతి
మనసారఁ బ్రేమించి నను బెండ్లియాడిన
యతనిఁ గూలిచి భర్తృహంత్రినైతి

గీ. అన్ని పాపాలకన్నను హత్యమిన్న
అఖిలహత్యలఁ జేసిన యధమురాల !
పెనిమిటినిఁ జంపుకొన్న పాపిష్ఠురాల !
విగతభర్త్రుక నేను జీవింపనేల !

ఈ తుచ్ఛశరీర మింక భూమికి భారంబుగాదా! సర్వజన గర్హ్యంబుగాదా! ఓభూదేవీ! నీ వొక్కసారి బ్రద్దలై నన్నంత మొందింపలేవా! అయ్యో! ఎంత వెఱ్ఱిదానను! నేను సీతనా! సావిత్రి నా! సీత! - సావిత్రి! - ఆమహాపతివ్రతల పేరెత్తుటకైన నర్హురాలనా! కాను! తగను! తగను! ధనవంతుఁడుగానీ దరిద్రుఁడుగానీ మహారాజుగానీ సన్యాసిగానీ కులీనుఁడుగానీ కులహీనుఁడుగానీ కుంటిగానీ గ్రుడ్డిగానీ కుష్ఠుగానీ భ్రష్టుగానీ - పతియే దైవము - పతియే తల్లి - పతియే తండ్రి - పతియే సర్వస్వమని పతులను బూజించిన మహాసాధ్వీమతల్లులు వారు. నేనో సకలజన సముక్షమున రాయలఖడ్గమునకుఁ బూలమాల నలంకరించి వరించితినని సమంత్రకంబుగా నొప్పుకొని యిప్పు డట్టిపతినిఁ జంపి హైందవస్త్రీజాతికఁ తకును మాయని మచ్చఁ గల్పించిన మహామారిని. సజ్జనసమ్మతము - మోక్షదాయకము - యశస్కరము - శుభప్రదము - అఘమర్షణము - ప్రశంసాయోగ్యముగదా సతీచరిత్రము! ఓపతివ్రతాశిరోమణులారా! మీ మూలమునఁగదా యీభరతఖండము వన్నెగాంచినది. అట్టిభారతభూమి నేఁడు నామూలమునఁగదా భర్తృహంత్రులుగూడఁ గలరను దుర్యశమునకుఁ దావలమైనది.

సీ. అఖిలలోకంబుల కాధారభూతుఁడౌ
        సజ్జబాంధవునకు నాంక్షఁ బెట్టి
    ప్రాణముల్ వీడిన భర్తను బ్రతికించి
        వైవస్వతునివల్ల వరము లంది
    ముజ్జగంబుల నేలు ముమ్మూర్తులను గూడ
        నబ్బాలబిడ్డలయ ట్లొనర్చి
    పట్టినంతన దగ్ధపటలంబుఁ గావించు
        నగ్నిలో బంగార మట్లు మెఱసి

గీ. వరుసఁ బదునాల్గుభువనముల్ బంతివోలెఁ
బట్టి యాడించి కీర్తిఁ జేపట్టినట్టి
సుమతి సావిత్రి యుల యనసూయ సీత
మొదలుగాఁ బతివ్రతలకుఁ బుట్టినిల్లు.

ఉ. అట్టి పతివ్రతామణుల కాకరమై భరతావనీస్థలిన్
బుట్టి మహాయశోవిభవమున్ గని వెల్గెడిచక్రవర్తిఁ జే
పట్టి పతివ్రతల్ సలుపు భర్తృసపర్యకు దూరమైతి నే
నిట్టి యసహ్యపుంబ్రతుకు నీడ్వఁగ నేటికిఁ జత్తునిప్పుడే !

(ఖడ్గముఁ గైకొని పొడుచుకొనఁబోయి (క్రిందకుదించి) కాదు కాదు. అశేషశేముషీమంతుఁడును మహానుభావుఁడును బరాక్రమశాలియు నగు రాయలపవిత్రరక్తముచేఁ దడుపఁబడినది యీఖడ్గము. ఈకత్తితోఁ బొడుచుకొని యీతుచ్ఛురాలి పాపపురక్తముచే నాపుణ్యపురుషునిరక్తము నపవిత్రముఁ జేయఁజాల ! చేయఁజాల ! (ఆకత్తి నావలఁ బాఱవైచి మొలనుండి యొకబాకు నూడఁదీసి) ఓదేవతలారా ! ఓదిక్పాలులారా ! నా తుదిమొఱ నాలకింపుఁడు. ఎవ్వరు చూడకున్నను మీరుమాత్ర మెల్లరఁ జూచుచుందురుగదా! నాతప్పు క్షమింపుఁడు (లేచి మంచము సమీపింపఁబోయి) నాభర్తనొక్కసారి కడసారి చూతుఁగాక ! అబ్బా ! చేరఁజాల! చూడఁజాల! ఘోరము! భయంకరము - ఛీ ! ఈపాపపుఁగన్నులతో నాపుణ్యపురుషునిఁ జూడ నొల్ల. (వెనుకంజవేసి) ఓదేవతలారా ! ఈకర్ణాటసామ్రాజ్యలక్ష్మీధురంధరుని - ఈయఖండవిజయభద్రముద్రాంచితుని - ఈకృష్ణరాయలనే నాకు జన్మజన్మమునకు భర్తనుగాఁ జేసి నన్ననుగ్రహింపుఁడు ! (పైకిఁజూచి) హా ! నాథా ! నాథా! స్వర్గమలంకరించితివా ? నేనును నిన్ననుసరింతు. ఏమి ? దురాత్మురాలనని నన్నుఁ దిరస్కరింతువా ? అయిననుసరే ! (పొడుచుకొనఁబోవును - వెనుకనుండి తిమ్మరుసు ప్రవేశించి యామె చేతినిఁబట్టుకొనును.)

తిరు:—(నిశ్చేష్టురాలగును - కొంతవడికిఁ దెలివి వహించి) కలయా! నిక్కువమా! కానసమా! అంతఃపురమా! నేను జీవించి యుంటినా? మరణించితినా? లేదా? వీరెవరు? తిమ్మ - రుసు - గారూ

తిమ్మ:—తల్లీ! నీవు విచారింపకుము. ఇది కలగాదు. కల్లగాదు. కాననమును గాదు. మారాయ లవతారపురుషుఁడు. అవతారపురుషులకుఁ జావన నెక్కడిది? వలయునేనిఁ బరీక్షింపుము. చూడు మీపర్యంకముపై నొక్కరక్తపుబొట్టైనఁ గలదా? హత్యలేదు. చింతింపకుము.

తిరు:—(వెఱ్ఱినవ్వుతో) హత్య-హత్యలేదఁట! ఘాతుకురాలనుగానా! కానా! కానిచో మారాయ లేఁడీ! నాప్రాణప్రియుఁడెక్కడ! నిజముగా ఘాతుకురాలనే!

తిమ్మ:—కాదు. కాదు. కృష్ణా! కృష్ణా! నీ వవతారపురుషుఁడవైనచో నీ దేవికిఁ బ్రత్యక్షము కావలదా!

రాయలు:-(ప్రవేశించి చిరునవ్వుతో)

శా. దుర్వారంబగు నీదు సాహసము నీ దుస్సాధమౌ ధైర్యధీ
పర్యస్తమ్ము మహిష్ఠవిక్రమమహాస్సంపత్తి చిత్తస్థమై
సర్వాంగీణమునయ్యె మెచ్చఁదగు నీచందంబు నే నెంతయుం
గర్వం బందెద నిట్టినిన్ను సతిగాఁ గైకొంటకో మానినీ!

తిరు:—(ఆశ్చర్యచకితయై) రాయలా! కాదు! వీరు నిజముగా రాయలేనా! నేను తిరుమల నగుదునా! కానా! ఏమి! వీరు నన్ను రక్షించుటకు మరల నవతారమెత్తిరా! నిజముగా నవతారపురుషులే! అబ్బా! భరింపఁజాల! భరింపఁజాల! నా పరితాపమిప్పుడినుమడించినది. అయ్యో! నేనిప్పుడు దైవహంత్రినిఁగూడనైతినే! (కనులు మూసికొని) నాథా! మీ ముఖ మిఁకఁ

జూడఁజాల ! ఈబాకుతో నిప్పుడే పొడిచి యీపాపిని - ఈ దురాత్మురాలినిఁ జంపి పుణ్యముఁగట్టుకొమ్ము.

తిమ్మ:—తల్లీ ! నీవు పశ్చాత్తప్తహృదయవు. నీవలనఁ బాపంబు లేదు. విచారింపకుము.

రాయ:—దేవీ ! విచారింపకుము. నీవు క్షమింపఁబడితివి.

తిరు:—ఓయుదారహృదయా ! నాయొనర్చిన మహాపాతకమునకు క్షమించుటయా ! (నమస్కరించి) వలదు! వలదు. ఈపాపాత్మురాలికిఁ బ్రాయశ్చిత్తమనునది లేదు.

రాయ:—దేవీ! విచారింపకుము. (సమీపించి) చేయిపట్టుకొనఁబోవును.

తిరు:—(తటాలున వెనుకంజవేసి) ప్రభూ ! ప్రభూ ! ఈక్రూరురాలు పట్టినదెల్లఁ బాషాణము. ముట్టినదెల్ల విషపూరితము. ఈపాపరాశి నిలిచినచోటు భస్మమగును. ఈపాపుజీవికిఁ బుణ్యమా ! పురుషార్థమా ! మీరింకను దీనిని సామాన్యస్త్రీగాఁ దలంచుచున్నారు. అవతారపురుషులగు మిమ్ములను జంపవచ్చిన పూతన యిది. నన్ను నాకెకరా తక్షణమే మరణింతురు. శృంగారాలంకారములను నెపంబున నీశరీరమునిండ విషపూరితములగు కోడెకత్తులు నింపి (చెవులమూసికొని) అబ్బా !- జాగ్రదవస్థయందేయుండి నన్ను నందిటఁ జేర్చుకొందురనియుఁ దక్షణమే మరణింతురనియు నెంచి యెన్నియోపన్నాగంబులు పన్ని యింతసన్నాహంబున మిమ్ముఁ జంపుటకే యిటకు వచ్చితి (పెక్కుకోడెకత్తులను జూపును) ఇట్టి క్రూరరాక్షసిని భార్యగాఁబడయు మీకపకీర్తిఁ గాని తేవలెనా? నన్ను క్షమింపుడు. మీరు పొండు. నేను మరణింప నిశ్చయించుకొంటి (విచారముతో) భూవల్లభా! నాయొడలు సంతాపాగ్నిచే భగ్గుభగ్గున మండిపోవుచున్నది. నే నేమిచేయఁదలంచితినో నాకే తెలియదు. ఇయ్యాపగాథమును దలంచుకొని సహించి ప్రాణ

ములతో నిలువఁగలనా! బ్రతుకఁజాల! దుర్భరము! దుస్సహము! దుస్సహము! (మూర్ఛఁబోయిక్రిందఁబడును)

తిమ్మ:—ప్రభూ! పరిణామన్యాయమునఁ గాలవైద్యుఁడుగాని యీ రోగమును నిర్మూలము చేయఁజాలఁడు. మనకు వేగిరపాటు వలదు. పిదప యోజింతము నడువుఁడు.

(తొల్లిట దాఁగియుండిన తావునుండి యిరువురునిష్క్రమింతురు.)

(తిరుమల కొంతవడికి మూర్ఛనుండి తేరి)

ఆహా! ఏడీ! నా నాథుఁడు! నా దైవమునకు నాపైఁ గోపము వచ్చెఁగాఁబోలు. లేదు. లేదు. నీకుఁ గోపమన నెక్కడిది? నీ వెంత ప్రణయమూర్తివి! ఏమి నీ యుదారహృదయము! తొల్లి జయించిన రాజ్యమును నాతండ్రికిచ్చి వేసితివి. బంధితుఁడగు నాసోదరునివిడిచిపుచ్చితివి. కరుణాసముద్రుఁడవన నీవేకదా! అవతారపురుషుఁడవన నీవే కదా! నిన్ను నే నేమని నుతింపవలయునో తెలియకున్నది. నిన్ను వధించుటకు శరీరమునిండ విషపూరితమగు కోడెకత్తులు ధరించివచ్చిన యీరాక్షసినిఁ గడఁగంటిచూపుతోఁ జూచితివికాని యించుకయుఁ గ్రూరదృష్టిలేదు. కఠినశిక్షలేదు. శిక్షయేలేదు. వేఱొకఁడెవ్వఁడైన నాచేసినమహాపాతకమున కప్పుడే నాతలదెగఁ గొట్టకుండునా? ఉరి తీయింపకుండునా? ఉప్పుపాతర వేయింపకుండునా? అట్టివానిపట్ల నెట్టి యపచార మొనర్చితిని! దీనికిశాంతిగలదా? నేనొనర్చిన మహాదారుణమునకుఁ బ్రజలముఖ మెట్లుచూడఁగలను? ఇయ్యపచారముఁ దలంచుకొనిన నా యొడలినుండి పాపాగ్నికణములు బయల్వెడలి భగ్గుభగ్గున మండించుచున్నవి. అబ్బా! ఈబాధ దుస్సహము! దురంతము! దుర్దాంతము! దుర్నివారము! (మూర్ఛపోవును)

(తెరపడును)





శ్రీ

# తిరుమలదేవినాటకము

## పంచమాంకము

స్థలము - గొల్లపల్లె. (ఒకపిల్లవాఁడు పాడుచుఁ బ్రవేశించును)

**గేయము - చతురశ్రగతి.**

బలే బలే బలె లడ్డూలూ పంచదారలడ్డూలూ - తియ్యనైన లడ్డూలూ పట్టిడేసిలడ్డూలూ - బలే బలే బలె లడ్డూలూ -

మధ్య మధ్య కిసిమిసిపండు-పక్క పక్కల జీడీపప్పూ - లోపల్లో పల కుంకుమపువ్వు - పైకి పైకి ఘుంఘుమ-బలే బలే బలె లడ్డూలూ- (వెనుకనుండి మరియొకపిల్లవాఁడు వచ్చి లాగికొని తిని) ఒరే! ఎంత కమ్మగా తియ్యగా ఉందిరా! ఎక్కడిదిరా యిది ?

మొదటి:—వరదరాజమ్మవారి సత్రములోనిది వంలడ్డూరా! ఆతల్లి రోజూ రోజూ లడ్డూల సంతర్పణే. ఇదిగో యింకోటి.

ఆదానాలేమి - తానాలేమి - గేనాలేమి - గానాలేమి - బంగారోవులదానాలండీ - పసిడీకుండల దానాలండీ - జల్తార్ చీరల దానాలండీ - జమిలీదుప్పటి దానాలండీ - అదియేం టిదియేం టడిగినవారికి నన్నిరకాల దానాలఁడీ - (చూడడానికి కన్నులు వేయి చాలవు - చెప్పడానికి నోళ్లువేయి చాలవు) బ్రేవు బ్రేవుమని త్రేన్పులుమీఁదగ-పొట్ట సైతుగా జమురూకుంటూ - రోజూ రోజూ రెండూపూట్లూ - బేపనబిడ్డలు పెద్దగతిందురు - బేపనవోరను పేరే యేమిటి - జాతీ

భేదము లేనేలేక - కొద్దిగొప్పల తేడాలేక-ఆరని యీరని గొప్పాలేక-అష్టాదశములవారికి కూడా - పిండీవంటల భోజనమండీ - బలే బలే బలె లడ్డూలూ - మేలిబూందిలడ్డూలూ - వహ్వా! రవ్వాలడ్డూలూ ! కాశీమజిలీ లడ్డూలూ - బలే బలే బలె లడ్డూలూ - బలే బలే బలె - ప్రవేశకము (నిష్క్రమింతురు)

---

## మొదటి రంగము

స్థలము - గొల్లపల్లె - కుటీరము - వరద రాజమ్మ ప్రవేశించును.

వరద:—(నిట్టూర్చుచు) ఇంతింతనరాని ధనము వెచ్చించి యీప్రాంతమువారికిఁ గలననుమాటయే కలవగునని యిన్నిదినంబుల నుండి బహుప్రయాసల కోర్చి రాయలవారిపేరిట సీకృష్ణరాయ సాగరమును త్రవ్వించితి. ఈ సంవత్సరము విశేషవర్షములు గురియుటచేఁ జక్కనివనరు లేర్పడినవి. శ్రీకృష్ణదేవరాయల పేరఁద్రవ్వించిన యీకాసారమునిండ నీరుపడుటచే నాయభీష్టమీడేరినదనుకొంటిని గాని దైవయోగంబున నాల్గవతట్టు కట్ట తెగి గండిపడినది. అయ్యో?ఇప్పుడుచేయఁదగినపనియేమి!గండి కట్టుటకు నాసర్వధనప్రాణములైన నర్పించి యీపని సొంతముగాఁ జేయకూరకుందునా? నాతలఁచినకార్యములెల్ల గట్టెక్కించుటకు నాకృష్ణుఁడు లేఁడా? కృష్ణా! నీవవతారపురుషుఁడవు, సర్వజ్ఞుఁడవు, నాహృదయ మెఱుంగలేవా? ఈ యాపద నుండి నన్నుద్ధరింపరావా? (నిమీలితనయనయై ధ్యానించును) (కృష్ణవేణియనుగొల్లది శక్తిపూని వేఁపరొట్టఁ జేతఁబట్టి నలుగురు పట్టుకొనిరా ధూపములెగయఁ దూలుచు వచ్చును)

వకుళ (వరద రాజమ్మచెలికత్తె):—అమ్మా? శక్తిపూనినకాంత యిటే వచ్చుచున్నది.

వర:—(కనులు దెఱచి) వకుళా ! రానిమ్ము.

(ప్రజలును కృష్ణవేణియు వరదరాజమ్మను సమీపింతురు)

వకుళ:—(ధూపమును వేయును)

కృష్ణ:—(సోదెకత్తె) వరదరాజమ్మా! నువ్వు సేనాసేనా బత్తురాలవే- ఎంతో మంచి మనుస్సుగలదానవే - లచ్చోపలచ్చలు ఖర్చు పెట్టించావే-నీ కార్యం గట్టెక్కి కాస్తలో పోతూందే - నీపడ్డ శ్రమంతా గండిపడిపోయిందే - నేనిక్కడుండానే జలదేవత నే- జలదేవతనూ - నామాటే మరిసిపోయావే-నా ఊసే గేపకం లేదే - నిన్ను సేనాసేనా కట్టపెడతానే - ఆలోశనలతో గండికట్టుపడుతుందిటే వెఱ్ఱి తల్లీ! నాకడుపునిండే ఊసుఉం దే- నీకోరిక నెఱవేరాలా అంటే - నీకు చెఱువు కావాలాఅంటే- నన్ను తృప్తిపరచాలే తల్లీ !

వర:—పది దినములనుండి సర్వశాంతికరముగా వేలకొలఁది భూసురులకు సమారాధనములు జరుపుచుంటిని. పూజలు వేదాధ్యయనములు నిరంతరహోమము లవి యివి యననేల సమస్తము చేయించుచుంటి. గంగమ్మ తల్లీ ! నీకు వజ్రవైడూర్యాదు లర్పించితి. సర్వాభరణము లొసంగితి. వేఱేమికావలయును జెప్పవమ్మా తప్పక యిచ్చెదను.

కృష్ణ:—వజ్రా లక్కరలేదే మా యమ్మా ! వైడూర్యా లక్కరలేదే మాయమ్మా! గుడు లక్కరలేదే గోపురా లక్కరలేదే వరద రాజమ్మో - నర బలి కావాలే - నరబలి - నే పోతున్నా - పోతున్నా . (అదృశ్యమైపోవును)

వర:—(మందహాసముతో) సరళా ! నేనెంత ధన్యురాలను ! నేటికి నాతపస్సు ఫలించినది. నా నోచిన నోములన్నియు సఫలీ కృతములైనవి. అవతారపురుషులగు వారిపేరఁ ద్రవ్వించిన

యీ కృష్ణరాయ సాగరమును జిరస్థాయిగా నొనర్చుటకు నా కిప్పుడు చక్కని యవకాశము చిక్కినది. వేనవేలు జనులు జీవించుట కాధారభూతమైన యీ సరస్సును సర్వప్రాణులకు నాధారమైన యీ పద్మాకరమును నిల్పుట నా విధి. నాశరీరమును గండిలో వైచి వరుణదేవతకు బలియొసంగి నాజన్మ సార్థక మొనర్చుకొందును గాక !

ఉ. ఏనుఁగు వేయి చచ్చినను నెద్దుమొదల్ గల హీనజంతు సం
తాన శరీరపాళి సయితమ్ముపయోగపడుం గతించియున్
మానవదేహ ముండియును మానిని ! దేనికిఁగూడఁ గాదు నా
మేనును గండిలో వయిచి మే లొచరింతుఁ బరోపకారతన్.

సరళ:—అమ్మా ? నీవు పోయిన సిందు నివసించువారెవరు? మేమును నీతోడివారమే.

వర:—సరళా ! విజయనగరాంతఃపురము నుండి నాఁటి రాత్రి నన్నును నాసమస్త సామగ్రిని వేషాంతరమున రహస్య ప్రక్రియల దాఁటించి యీ తావుఁజేర్చి నాఁడే మరణింప సిద్ధపడిన నాకడ్డు పడి యీపాటి కీర్తి నార్జింపఁజేసిన నీ కెంతయుఁ గృతజ్ఞురాలను. నేఁడు మొదలీమందిరమునకు నీవు ప్రభ్వివై నేను లేని లోపములను దీర్చుచు సర్వప్రాణులను సమదృష్టిఁజూచుచు మానవసేవ - సంఘసేవ - దేశసేవ - చేయుచు భారతభావి సంపదున్నతికిఁ బ్రయత్నించుము.

వకుళ (ప్రవేశించి):—ఆహా ! తల్లీ ! నీకెంత యుదారస్వభావము ! ఏమి సాహసము ! ఎంత స్వార్థత్యాగము ! ఏమి పరోపకారబుద్ధి ! నీవు పోవలదు. మేమే యీకార్యము నిర్వర్తించెదము. (కాళ్లకడ్డుపడును)

సరళ:—(కాళ్లపైఁబడును)

వర:—(తనలో) ఇప్పుడు వీరి నదలింపకున్నచోఁ గార్యమున కంత రాయము గలిగి నాకోర్కె యీడేరదు. (ప్రకాశముగా) చెలి కత్తెలారా! మీప్రేమకు సంతసించితిని. (కోపదృష్టితో) ఇది నాయాజ్ఞ. తొలఁగుఁడు! నాకార్యమున కంతరాయము గలి గింపవలదు.

(వకుళ, సరళలులేచి తప్పుకొందురు - వరదరాజమ్మ పోవుచుండును.)

(తెరపడును)

---

## రెండవ రంగము

(చినకంబఁడు - పెదకంబఁడు - నను నిరువురు కుఱ్ఱలు పండ్రెండు బదునాల్గు సంII రముల వయస్సువారు)

చిన:—అన్నయ్యా! నేనో చిన్నకథ పొడుస్తాను చెప్తావురా? ఉడుము ఎన్నేళ్లు బ్రతుకుతుంది చెప్పు.

పెద:—వెయ్యేళ్లుబ్రతుకుతుందిరా తమ్ముడూ!

చిన్న:—వెయ్యేళ్లే! పామో?

పెద:—ఎవరూ చంపకపోతే అదీ అంతే

చిన:—కాకి

పెద:—చిరకాలం

చిన:—వీనివల్ల లోకాని కేమైనా ప్రయోజనం ఉందంటావా? మనమో?

పెద:—మనము నూరేళ్ళా బ్రతుకుతాం.

చిన:—ఛీ! కాదురా అన్నయ్యా! మనగురువుగారు మొన్న అన్నారు 'అనిత్యానిశరీరాణి' అంటూ యేదో చదివారు. అంత అస్థిరం మనజీవితాలు.

పెద:—ఔను. అదంతా వేదాంతం.

చిన:—అన్నివిద్యలలోనూ ఏవిద్యమంచిదంటావు? వేదాంతం మంచిదికాదూ! ఎంతబుద్ధిమంతులైనా సాధించలేక చచ్చి చివరకు వేదాంతంలో దిగుతారు. అదిగాదు గొప్ప. ముందే వేదాంతార్థము తెలుసుకోడమే గొప్ప.

పెద:—ఔను. మన కీలోకములో ఏమీశాశ్వతంకాదు. శరీరాలు నీటి బుడగలలాంటివి. భోగాలు క్షణభంగురాలు.

చిన:—ఇంతఅస్థిరమైన అసహ్యామైన శరీరం విడిచి స్థిరమైన ప్రవిమలమైనకీర్తి మన మెందుకు సంపాదింపఁగూడదు?

పెద:—నేనూ అందుకే చూస్తున్నానురా తమ్ముడూ. మంచి అవకాశంకోసం ఈ శరీరాన్ని విడిచామంటే అనేకుల కుపయోగించాలి.

చిన:—అయితే కృష్ణవేణికి శక్తిపూని చెప్పినపలుకులు నువ్వువినలేదాఏమిటి? చెఱువుకట్ట ఆగడానికి నరబలి కావాలట. కట్ట ఆగితే యీ చుట్టుపట్ల వేలకొలది లక్షలకొలది జనుల కీసరస్సు ఆధార మవుతుంది.

పెద:—(ఆశ్చర్యముతో) ఏమిటీ! వినలేదే! అలాయితే ఆలస్య మెందుకు? ఎంతో చాలాకాలందాకా తల్లక్రిందులుగా తపస్సు చేస్తేనేగాని రానిమోక్షం మనం సాహసించామంటే క్షణంలో వస్తుంది. త్వరగా వెళ్ళి ఆగండిలో పడదాంపద.

చిన:—నడునడు. ఈ సంగతి యెవరికైనా దెలిస్తే మనకీర్తిని పంచుకుంటారు. (తెరపడును)

(తెరలోఁ దాళధ్వనులు జేగంటల ఘణఘణలు)

హరహరా! గోవిందా! గంగమ్మతల్లికి జై! వరదరాజమ్మవారికి జై.

## మూడవ రంగము

(పూడ్చిన గండి సమీపమున వరదరాజమ్మ విచారించుచు నిలచును.)

వర:—అకటా ! ఈ పాడుశరీర మెంత యపవిత్రమైనది. నే నెంత పాపాత్మురాలను! ఎంత నిర్భాగ్యురాలను!

క. చనిపోవ నెన్నియత్నము
లొనరించినఁ జావు జీవి కొనఁగూడు నె మే
దినిఁ జేసినకర్మఫలం
బనుభావ్యంబగునుగాదె యవ్విధికైనన్.

ఈబాలురపాటి పున్నెంబుఁ జేసికొనుటకైన నోచనైతిఁగదా!

ఉ. తొల్లి పరోపకారములదొంతరలన్ ఘటియించుచున్ యశో
వల్లరు లెల్లదిక్కులకుఁ బ్రాకఁగఁ జేసిన రుద్రమాది భా
స్వల్లలనాశిరోమణులు పాదరజంబుకైనఁ గూడ నేఁ
జెల్లరె! పోలనైతిఁగద! చెల్లెను జీవిత మిట్లు వ్యర్థమై.

ఈకుర్ర లెంతధన్యాత్ములు ! సకలజనోపయోగార్థము ప్రాణములు సమర్పించిన యీ కుఱ్ఱలపే రాచంద్రతారార్కమై వెలయుఁగాక ! చినగొల్లపల్లె పెదగొల్లపల్లె ప్రజలారా ! ఓ దేవతలారా ! ఓ పంచభూతములారా !

మ. చినకంబండును పెద్దకంబడను నీచిన్నారి పొన్నారు లీ
తనువుంజూడరు భోగముల్ దలపరున్ దల్లిన్ మతిన్ దండ్రినిన్
మనమం దెంచరు వీర లెంతఘను లన్నా ! పల్లె లీ రెండిఁకన్
జినకంబంబును పెద్దకంబమనుచుం జెల్వారుఁ బట్నమ్ములై.

(వకుళ-సరళ-కొందరుప్రజలు తత్సమీపమునకుఁ జేరుదురు.) వరదరాజమ్మకు నమస్కరించుచు నిలఁబడుదురు. (తెరపడును.)

---

## నాల్గవరంగము

గొల్లపల్లె-ప్రదేశము-రాయలును, వీరసింహుఁడును వేఁటదుస్తులతోఁ ప్రవేశింతురు.

కృష్ణ:—వీరసింహా! గుఱ్ఱములఁ దరుమూలంబులకుఁ గట్టి భద్రపఱచితివా?

వీర:—చిత్తము మహాప్రభూ! భయంకరమైన గాలి దుమారముచే నాశ్వికులందఱును జెల్లాచెదరై పోయిరి. నేనొక్కఁడనే స్వామి వారిని వెంబడించుచుంటిని.

కృష్ణ:—తొలుతనుండియు మాకుఁ దలలోని నాలుకవంటివాఁడవు నీవేకదా! ఈయరణ్యప్రదేశములు నిమ్నోన్నతములై మిక్కిలి జారుడు గల్గించుచున్నవి. జాగ్రతసుమా! ఈప్రదేశము లెంతయుఁ గ్రొత్తలు.

వీర:—దేవా? ఎట్టయెదుటఁ బల్లెగొయిందు గన్పట్టుచున్నది.

కృష్ణ:—అట్లయిన నచ్చటికిఁ జేరుకొందము నడువుము. (కొంతదూర మేగి) వీరసింహా! ఇదియేమి? విశాలమై రమణీయమై యీ తటాకమింత యొప్పునే?

గీ. నాల్గువైపులకును దాచి నవరసాఢ్య
మధికరుచిరంబు గంభీర మగుచు వెలసి
సుకవినిర్మితపద్యంపు సొంపు దాల్చి
హాయిగూర్చుచున్నది యీ జలాశయమ్ము.

వీర:—రాజేంద్రా! మీకు హాయి గూర్చుచున్న దేమోకాని యీ చెఱువుచూచిన నాగుండె చెఱువగుచున్నది. ఇదియొక పిల్ల సముద్రమను కొంటినిగాని తటాకమను కొనలేదు స్వామీ!

కృష్ణ:— వెండియు నిది మిక్కిలినూతనముగాఁ గన్పట్టుచున్నది. ఇట్టి మహాతటాక మే మహనీయులచే నిర్మింపఁబడినదో కదా! (పరికించి) అటుచూడుము. ఆ సరస్తీరమున నేదియో స్తంభము పొడఁగట్టుచున్నది. అం దక్కరములుగూడఁ గన్పట్టెడిని.

(వీరసింహుఁ డా స్తంభము దగ్గరకుఁబోయి) ఔను. స్వామీ! శ్రీశ్రీకర్ణాటసామ్రాజ్యలక్ష్మీధురంధరులును బరమదయాస్వరూపులు...

కృష్ణ:—(మందహాసముతో) అదియేమి వీరసింహా! ఆ స్తంభము మీఁదివ్రాఁత చదువుమని నేను చెప్పఁగా నేదియోచదువ మొదలుపెట్టితివి.

వీర:—ప్రభూ! భవదాజ్ఞ నందలి యక్కరములు 'తూచా' తప్పకుండ జదువుచుంటి వినుఁడు...పరమదయాస్వరూపులును నవతార పురుషులును మార్తండతేజులునగు శ్రీకృష్ణదేవరాయలవారి కాయురైశ్వర్యయశోభివృద్ధిగా వరదరాజమ్మవారు - ఒకయడ్డ గీత స్వామీ - భక్తురాలు నిర్మించిన కృష్ణరాయసాగరమను నీ తటాకము సర్వజనోపయోగమై యాచంద్రతారార్కము వర్ధిల్లుఁగాక!

రాయ:—(పరవశుఁడై) ఆహా! ఎవ రా వరదరాజమ్మ! ఇంతింతన రాని ధనమువెచ్చించి చివఱకు నాపేరిడి నాయెడ భక్తిఁజూపి నాకృతజ్ఞతకుఁ బాత్రురాలగు నయ్యకలంకచరిత్ర యెవ్వతెయై యుండనోవు! మహాత్యాగరూపిణిగాదా యామె. పోయి యామె దర్శనభాగ్యము ననుభవించివత్తము నడువుము.

(తెరపడును)

---

## ఐదవరంగము

వరదరాజమ్మ పర్ణశాల (కృష్ణరాయలు ప్రవేశించును)

రాయ:— ఈపర్ణశాలాప్రవేశము సంపాదించుటే కడుకష్టమైనది. ఇట్టి కట్టుబాటులు రాచనగరులఁగూడఁ గొలంతయే యనవచ్చు. ఆహా ! ఇది స్వయంప్రభాగుహాంతరమువలెఁ జిత్రమయమై కన్పట్టుచున్నదే. (ఒకవైపునకుఁ దిరిగి) ఈయెదుటఁ బాడఁగట్టు మానిసి యెవ్వఁడు ? నేనెవ్వఁడను ? ఔరా ? ఇది నా విగ్రహమేనా! సజీవమా నిర్జీవమా యిది!(మరియొకదెసకుఁదిరిగి) ఏవైపుగాంచినను నాచిత్రములే చిత్రవిచిత్రములుగాఁ గన్పట్టుచున్నవి. ఎచ్చటఁజూచినను భక్తి! భక్తి మూర్తిభవించినది! భక్తిరసము వెల్లి విరిసినది.

సీ. ఏవైపు గనుగొన్న నిందిరాసుందరీ
మందిరంబగువాని మందిరములె
ఏచాయఁ జూచినఁ బ్రాచీనసాధ్వీమ
తల్లికాచిత్రసంతానకములె
ఏదిక్కు వీక్షింప బుగ్యజుస్సామాది
వేదఘోషంబుల వికసనములె
ఏచోటఁ బరికింప నిద్ధపురాణేతి
హాసప్రసంగ హాల్లీసకములె

గీ. భజనకీర్తనలేమి యాపాటలేమి
భూరి సంతర్పణములేమి పూజలేమి
నిష్ఠలవియేమి నియమప్రతిష్ఠలేమి
యెందుఁజూచిన భక్తి యాకృతినిఁ దాల్చె.

(కొంచెము లోనికిఁబోవును - ఒకదెస శ్రీకృష్ణవిగ్రహము నెదుట నిమీలితనయనయై వరదరాజమ్మ ధ్యాననిష్ఠలో నుండును)

రాయ:—(చకితుఁడై) ఆమనోహరాంగియగు యోగిని యెవ్వరు ?
ఏమియామె సౌందర్యము!

సీ. కాటుక పెట్టకే కమలాక్షి కనుదోయి
కజ్జలం బూనినకరణిఁ దోచు
చమురైనఁజమరకే సతికేశపాశంబు
మిసమిసలాడు తుమ్మెదలఁ దోలు
తీరిచిదిద్దకే వారిజాక్షి మొగంబు
పూర్ణచంద్రునితోడఁ బోరునలువు
భూషలుదాల్పకే పొలఁతి విగ్రహకాంతి
చంచలాలతికను గొంచెపఱచు

గీ. విలువవేవలువలు దాల్పకే వెలఁదిమిన్న
ఘనదుకూలంబులను దాల్చుకరణిఁ దోచు
సహజసౌందర్యయుతలైన జవ్వనులకు
పూతమెఱుఁగులతోడి సంగాతమేల!

ఆ కలికి కృశించియున్నను నెంతమనోహారిణిగా నున్నది. ఆమె తిరుమలదేవియై యుండదుగదా! ఏమి? నా వెఱ్ఱిభ్రాంతి! ఆశూరత్వము! ఆవీరత్వము! మొగమునందు నలుసంతయుఁ గన్పట్టదే ! ఆమహాశూర కాంత తిరుమల నాకిల్లాలగు సదృష్టమీజన్మమున లభించునా ? ఆమె యేయరణ్యముల పాలయ్యెనో ? ఏకూరమృగముల బారిఁబడెనో ? ఏదారుణ కృత్యమొనర్చెనోకదా ! అది మొదలామె జాడయేలేదు. కృశీభూతశరీరయయ్యు నిపు డీమె యెంత ప్రకాశించుచున్నది ?

గీ. ఎంత కృశియించి యుండిన నీలతాంగి
యుల్ల ముప్పొంగఁ జేయుచు నున్న దహహా !
కళల దిగనాడి వక్రతఁ గనియుఁ గూడ
సంద్రమును పొంగఁజేయదే చంద్రరేఖ !

ఈ యమలచరిత్రను జూచిన నేలాకో తిరుమలను జూచినట్లే యున్నది. తప్పక తిరుమలయే కావలయును. కాకున్న నన్యకాంతా జనపరాఙ్ముఖమగు నాహృదయ మీమెయెడ సుముఖముకానేల? ఇప్పు డప్పాజియుండినయెడ సంశయవిచ్ఛేదమై సఫలీకృత మనోరథుఁడనై యుందునుగదా ! (ధ్యానానంతర మామెలోనికిఁబోవును) మెఱపుఁదీవవలె నదృశ్యమైన దీశగుణి ఔరా! ఆమె తిరుమలయేయైన నెంత మార్పుగలదు. క్రూరదృక్కులేవు భయంకరాకారమూ కాదు. మూర్తీభవించిన శాంతమే యాకాంత.

గీ. అతిభయంకరమగు హాలహలము వెనుక
పుణ్యనిధియైన యమృతంబు పొడమినట్లు
భువనభీకర మాభాను మోమునందు
అద్భుత మనంతమగుశాంతి ముద్భవిల్లె.

(ఘంటారావము వినవచ్చును)

అదె ఘంటారావము. అయ్యో! ఇంక నిటనిల్వరాదఁట. ఇందుండి తొలఁగవలయుఁగదా ! (పర్ణశాల వెలుపలకుఁబోవును) (వీరసింహుఁ డెదురువచ్చి) దేవా! మనము వచ్చి తడవయ్యె.

రాయ:—సత్వరము పయనయము సాగింపవలయు నడువుము.

వీర:—చిత్తము. అల్లవే గుఱ్ఱములు సిద్ధముగానున్నవి.

(నిష్క్రమింతురు.)

---

## ఆరవరంగము

వరదరాజమ్మవారిపర్ణశాల

(ఇరువురుసందేశహారులు చెన్నఁడు తిన్నఁడు ననువారు ప్రవేశింతురు)

తిన్న:—(తలుపుతట్టును)

వర:—(తలుపు తెఱచును)

తిన్న:—తల్లీ ! కళింగదేశము మాది. జాబు. జాబు.

వర:—కళింగదేశమా ! మాతలిదండ్రులు సుఖమున్నారా ? కూర్చుండుడు (జాబునందుకొనును. ఇరువురుఁగూర్చుందురు)

తిన్న:—అమ్మా ! దైవకృప నందరు క్షేమము. కాని యమ్మగారు మీ దుస్థితి కెంతయు బెంగపెట్టుకున్నారుతల్లీ !

చెన్న:—కాకేమి ? పండువంటికాపురం భగ్నంఅయిపోయింది.

వర:—(జాబువిప్పి) సరళా ! చదువవే.

చెన్న:—(తనలో) రాచదేవి యెక్కడికిపోవును ?

సర:—శ్రీమచ్చిరంజీవినిసౌభాగ్యవతియగుతిరుమలను మీతల్లి నరసమాంబ దీవించివ్రాయులేఖ:—

బిడ్డా ! నిన్నుజూచి యెన్నోయుగములైనట్లున్నది. నాకన్నులు కాయలుకాచిపోయినవి. నీవు యోగినివైతివని గూఢచారులవలన విన నాయెడలు చీమలుజెర్రెలు ప్రాకినట్లున్నది. అల్లారుముద్దుగాఁ బెఱిగిన నీ కెన్నిపాట్లువచ్చినవి ?

వర:—(కంటఁదడిపెట్టుకొనుచు) కాలగతి...

సర:—నీకర్మమేమికాలినది. ఆదిక్కుమాలిన కృష్ణరాయలను - ఆ దాసీపుత్రుని...

వర:—ఆ! ఆ! (చెవులుమూసికొని) భర్తృనిందయా! మహాపాపము!

సర:—ఆ హీనవంశసంజాతుని...

వర:—వెఱ్ఱితల్లీ ! కాదు. కాదు. నాభర్త యవతారపురుషుఁడు.

సర:—పెండ్లియై యడవుల నెట్టియిడుమల...

వర:—(కోపముతో) సరళా! జాబులోనిసంగతులు విశదమైనవి. ఇకఁ జదువవలదు. ఈసందేశహారులకుఁ గడుపార నన్నంబిడి బహుమతులొసంగు మీలో ప్రత్యుత్తరము వ్రాసియిచ్చెద.

(తెరపడును)

## ఏడవ రంగము

మార్గమధ్యమున వృక్షచ్ఛాయ. (తిన్నఁడు చెన్నఁడు ప్రవేశింతురు.)

చెన్న:—ఆలేఖయం దేమియున్నదో విప్పిచూతమా ?

తిన్న:—(జాబువిప్పి) చదువుదునా ?

చెన్న:—శీఘ్రముగా —

తిన్న:—పూజ్యురాలగు శ్రీశ్రీశ్రీమాతృదేవి పాదపద్మములకు మీ ప్రియకుమారి తిరుమల యానతమ్మ వ్రాయు విజ్ఞప్తి:— తల్లీ కర్ణకఠోరమైన నీయుత్తరముఁజూచితిని. అవతారపురుషుఁడగు నాథుర్తయెడ నేఁజేసినయపరాధమునకుఁ బ్రాయశ్చిత్తమున్నదా ? నీవువ్రాసిన యొక్కొక్కయక్కర మొక్కొక్క వజ్రాయుధమై నాహృదయమును వ్రక్కలించుచున్నది.

గీ. హృదయవారిధి నౌర్వాగ్ని నేనిఁ దాల్తుఁ
గాని భరియింపలే నొక్కక్షణముగూడ
దుష్టశిక్షణార్థంబు ప్రాదుర్భవించి
నట్టిశ్రీకృష్ణరాయనిందాగ్నికణము.

వానినామస్మరణమే నాకమృతాన్నము. వాని దివ్యమంగళ విగ్రహపూజయే నాకు దేవపూజ. వేయేల?

ఉ. రాయలెతల్లి తండ్రియును రాయలెదాత గురుండు దైవమున్
రాయలె విద్యయుక్ నరుఁడు రాయలె యోడ్డడ రాయలేనుమీ
రాయలఁబొందకున్నయెడ రాయియొ రప్పయొయైయె వనమ్ములో
రాయిడే నొందుచే నుగతి రాయలతత్త్వమెఱింగి చెప్పితిక్.

నాయనగారికి నానమస్కారములు.

విధేయురాలు,
వరదరాజమ్మ.

చెన్న:—(ఆనందబాష్పములు రాల్చుచు) అప్పాజీ! అదినిజమే!

మీరు చూడలేదుగాని యామె పర్ణశాలయంతయు నాచిత్ర ఫలకములతోడనే నిండియున్నది.

తిమ్మ:—కుమారా! ఆపర్ణశాలావాటికయందే కాదామె హృదయ పేటికయందును భవద్విగ్రహమే కాన్పింపఁగలదు.

గీ. మును పరీక్షార్థము హృదయమును బగిల్చి
రమణఁ దనస్వామియైన శ్రీరామచంద్రుఁ
జూపఁగలిగిన యంజనానూనుకరణి
సుదతి హృది చీల్చి మీరూపుఁ జూపఁగలదు!

రాయ:—(విషాదముతో) అప్పాజీ! అమల మమూల్య మవధారణార్హ మనమాన మగు జాతిరత్నమును గ్రహింప కింకను నుపేక్షచేయుట యక్రమముగాదా! ఇట్టి లోకోత్తర సౌందర్యవతి, గుణవతి చతురమతి యెందును గానరాదనిన నతిశయముకాఁజాలదుగదా!

గీ. బహుళిరాజ్ఞీ గుణంబులఁబరిఢవిల్లు
శాంతసౌజన్యసద్గుణాక్రాంత దీని
నడవిపాలుసేయక చేర్పు మంతిపురము
నిమిషమైనను బ్రాణంబు నిలుపదింక.

తిమ్మ:—రాజేంద్రా! అగ్నిపరీక్షకుఁగూడ నాగిన యీలతాంగి నిర్దోషురాలు (చేయెత్తి) ఇదే నాకట్టినకంకణము వెండియుఁ బరీక్షించి రాజకీయ సంరంభము లేమియు లేనిచో మీయాజ్ఞ ప్రకారమనతికాలంబునన యీతల్లి నంతఃపురమునఁ జేర్ప యత్నింతు.

రాయ:—అప్పాజీ! మీ ప్రతిభాన్వితవ్రాతల కాబ్రహ్మవ్రాతలు గూడ నడుగుపడునుగదా! మీమాట కడుగుదాఁటఁజాల.

తిమ్మ:—ప్రభువుల యనుగ్రహము. (నిష్క్రమింతురు.)

---

## ఎనిమిదవ రంగము

వరదరాజమ్మవారి పర్ణశాల-(కాశీవిలాసుఁడను యోగి ప్రవేశించును.)

పంతువరాళి—రూపకము

పల్లవి

"శంభో ! మహాదేవ ! శంకర ! గిరిజారమణ ! (శం)

అనుపల్లవి

శంభో ! మహాదేవ ! శరణాగత జనరక్షక !

అంభోరుహాలోచన; పదాంబుజభక్తిం దేహి: (శం)

చరణము

పరమదయాకర ! మృగధరహార ! గంగాధర ! ధరణీ

ధరభూషణ భక్తజాల వరహృదయనివేశ !

సురబృంద కిరీటమణి వరనీరాజితపద ! గో

పురవాస ! సుందరేశ ! గిరీశ ! పరాత్పర ! భవహర! (శం)"

వర:—(బయటికివచ్చి) స్వామీ ! ఈదాసురాలు వందనసహస్రము లాచరించుచున్నది.

కాశీ:—(చేయెత్తి) చిరాయురస్తు! భర్తృవాల్లభ్యమస్తు! సామ్రాజ్య పదవీసంసిద్ధిరస్తు !

వర:—అదియేమి స్వామీ ! మేము యోగినులమని యెఱింగియు నిట్లు దీవింతురా !

కాశీ:—తల్లీ ! మేము వేషభాషలనుజూచి మోసపోవువారముగాము. వారి వారి గ్రహచారముల ననుసరించి యాశీర్వదింతుము. జయ్‌గురు దేవప్రసాద్! వలయునేని చెప్పెద వినుము. నీవు యోగినివి కావు. నీ వొక మహారాజకుమార్తెవు గావలయును. నీకుఁ గారణాంతరమున భర్తవలన నెడబాటు వాటిల్లినది. ఔనా కాదా? మాచెప్పెడుదానికి విరుద్ధమున్నచోఁ దక్షణమే ఖండింపుము. జయ్‌గురుదేవ ప్రసాద్ జయ్.

వర:—(ఆశ్చర్యముతో) మీచెప్పిన ప్రతివాక్యము నిజము.

కాశీ:—ఏది నీయెడమచేయి

వర:—(ఎడమచేయి చాపును.)

కాశీ:—(తలయూచి) నీవు మహాపతివ్రతవు, కాని యేదో పాటుకు పుట్టి నీభర్తనుండి విడివడినట్టు లీ రేఖ తెలుపుచున్నది. నీభర్త నిన్ను స్వీకరింపఁడను ననుమానము నీమనమును పీడించుచుండవలయును.

వర:—యథార్థము స్వామీ ! యథార్థము ! వారిపేరు చెప్పఁగలరా?

కాశీ:—తల్లీ ! అది వట్టిభ్రమ. పేరెవ్వరు చెప్పఁగలరు. కొందరు లోకమును మోసగించుటకు ధనము లాగుటకు డాబులు పల్కుచుందు రది నా పనికాదు. నీవొక చక్రవర్తికి భార్యవని మాత్రము చెప్పఁగలను. తల్లీ ఆచేయిటు చాపుము.

వర:—(కుడిచేయి చాపును)

కాశీ:-(ఆకసమువంకఁజూచి) నీకరాబ్జముల మహారాజ్ఞీలక్షణంబులుగల హాలాదిరేఖలు గలవు. ఈరేఖలనుబట్టిచూడఁ జక్రవర్తి లక్షణములు గల సుగుణసంపన్నుఁడగు కుమారుఁడు పుట్టఁగలఁడనుట స్పష్టము.

వర:—ఈ నిర్భాగ్యురాలి కంతయు దృష్టమా ?

కాశీ:—గురుదేవప్రసాద్ ! గురుదేవప్రసాద్ ! నీప్రియుఁడు వియోగభారంబునఁ బదింతలు కృశించుచుండవలయు.

వర:—అదిసత్యమా స్వామీ ! ఔను ! మీమాట లమోఘములు. మీపలుకులు మంత్రంబులు. నేను రహస్యము దాచినను మీరు వెలిపుచ్చక మానరు. కడచిన వృత్తాంతము నుడువుటకుఁ గడుంగడు సిగ్గగుచున్నది. నేనవతారపురుషులగు శ్రీకృష్ణదేవరాయల......

కాశీ:—ఆ ! కృష్ణరాయ లామహోదారుఁడు నీకుఁ బ్రియుఁడా ? సెబాస్! చక్కఁగాఁ దగియున్నది. గురుదేవప్రసాద్ ! గురునాన ! గురునాన ! (హంసలఁబరీక్షించి) కుమారీ ! నిన్ను నేనతనికిఁ గూర్పఁగలనని తలంచెద. నన్నతఁడు తండ్రివలె గారవించును. కొండొక సందర్భమున నే నా మహానుభావునిఁ జూచియుంటి. కాని యావలఁ జక్రవర్తియగు రాయలు నీవలఁ గాశీవిలాసుఁడనని పేరు మోసిన యోగీశ్వరుఁడను నేను. సందేహ ప్రసంగ మేరీతినొనర్తును? మొదట సంఘటించిననవలఁ గార్యము విఘటించనేని వేఱె చెప్పవలసినదేమి ? (గడ్డము నిమురుకొనుచు) జయ్ మహాదేవ్ శంభో ! శంకరా !

వర:—(తత్తరముతో) స్వామీ ! మీకేల సందియము ? నేనీకృశించుట యా మహాత్మునికొఱకే. ఈ సత్కార్య పరంపరాచరణ మామహోదారునిఁ జెట్టఁబట్టుటకే. నాకు మీరు దైవమువలె సాక్షాత్కరించినారు. మహాకలుష పూరితమగు మత్పూర్వ రక్తబిందులేశ మింకను నా శరీరంబునందుఁ గలదు. అదియుఁ బూర్తిగా నింకిపోవలయు. మరొక్క నెల శుష్కోపవాసములచే నేను నిష్కళంకనవ్యరక్తధారాన్వితను గాఁగలను. వెండియు నల్లదే యాకాసారమునకు సోపాన పరంపరాది నిర్మాణకార్యములు పరిపూర్తి యొనర్తు.

కాశీ:—మంచి దక్లే చేయును. ఇట్టి సత్కార్యము లొనర్చువారికి భగవంతుఁడు తోడ్పడకుండునా ? జయ్ ! గురుదేవప్రసాద్. నేనును బుణ్యక్షేత్ర సేవానంతర మొకమాసమున కా రాజేంద్రునిఁ జేరఁగలనని తోఁచుచున్నది.

వర:—స్వామీ ! ఈలోననే యా మహానుభావునితోఁ బ్రసంగించి యీ దీనురాలి నుద్ధరింపలేరా ? ఇట్టి పాపాత్మురాలినిఁ జెట్టఁ

బట్టుట కాతఁడంగీకరించునా? నాది వట్టియడియాస. మీకును మాటదక్కనని తోఁచదు.

కాశీ:—తల్లీ ! నీకాసంకోచమువలదు. నాయొద్ద ననేకశక్తులుగలవు. నేనిప్పుడు నీకు సంధానకరణియను నమూల్యమూలిక నిచ్చెదను. దీని ప్రభావమిప్పుడే యెఱింగెదవుగాక. చేయిపట్టుము.

వర:—(చేయిపట్టును)

కాశీ:—(జటనుండినీరముపిండును) తల్లీ! నే పలికినపలుకులను మరలఁ బలుకుము. ఓసంధానకరణీ! నేను నిన్నే నమ్మినాను.

వర:—ఓసంధానకరణీ! నేను నిన్నే నమ్మినాను.

కాశీ:—కాశీవిలాసునాన! నీకు నిజమైన ప్రభావమేయున్నచో నాచేతిలోనికిఁ బరుగెత్తుకొనిరమ్ము.

వర:—కాశీ......రమ్ము (వేరుముక్క చేతిలోనికిఁ బరుగెత్తును)

కాశీ:—మూసివేయుము.

వర:—(మూసివేయును) ఆహా ! ఈమూలికాప్రభావ మసమానము.

కాశీ:—అమ్మా ! నమ్మితివా ?

వర:—సందేహమా స్వామీ? ఎట్లుకటాక్షించెదరో మీ దే భారము. వకుళా! వకుళా!

(వకుళ పళ్లెరమునందు వరహాలహారమును ఫలములనుంచి తీసికొనివచ్చి వరదరాజమ్మకందిచ్చును)

వర:—స్వామీ? ఈచిరుకాన్క గ్రహింపుఁడు

కాశీ:—(పళ్లెరమును గ్రహించి చిరునవ్వుతో) వెఱ్ఱితల్లీ! నేను ధనార్థము వచ్చినవాఁడనుగాను (ఫలమును గ్రహించి యాపళ్లెరము నందే యుంచివేయును) నీకు మేలుగలుగుఁగాక! సంధానకరణి నిరంతరము ధరించుచుండుము. మాసంబులోపల నీకు సర్వశ్రేయస్సులొనఁ గూర్పయత్నించెద. జయ్! గురునాన శంభో మహాదేవ! (నిష్క్రమించును.)



శ్రీ

# తిరుమలదేవి నాటకము

## షష్ఠాంకము

### మొదటిరంగము

విజయనగరము – (నన్నిజ్ – పోర్చుగీసురాయబారి)

ఆహా! ఈ హంపీవిజయనగరము భూలోకస్వర్గమే కదా! పెన్గొండలవరుసలే ప్రాకారములుగాఁగలిగి దుర్గమంబై సప్తప్రాకారావృతంబైన యీపురరాజమునందెవ్వాఁడును ప్రవేశింపలేఁడు. దయార్ద్రహృదయుఁడగు రాయలయాజ్ఞయు ననమాన శేముషీధనుండగు తిమ్మరుసునానతియు లేనిదే మారుతాతపములుగూడ నీపురమునఁ బ్రవేశింపవీలులేదు. నాయదృష్టవశమున నీపట్టణరాజమును జూచు మహాభాగ్యము లభించినది. ఆహా! ఈ యీవరణలోఁ బూయని వృష్పములు కాయనికాయలు లేవు. పెరుగనితరువులు పండనిపంటలు గానరావు. గోవానగరమునుండివచ్చినబాటయొకటి మొదటికొండవరుసలోఁగలద్వారములలో నొకద్వారముగుండ నగరములోనికి వచ్చుచున్నది. ఈ వీథులసొంపు– ఈచెక్కడముల పెంపు– ఈదేవాలయముల యింపు– ఈప్రసూనసౌరభముల ముంపు – ఈవిద్యావినోదంబులయందలి మంపు– ఈవరపుంగవు తెంపు – నిలింపపతిపురంబునఁగూడ హాళికిఁయున్న నందేహమూ? ఇందున్న తాతోలులింగనాదుల చిత్రశిల్ప

కళావిశేషమున కామయుని శిల్పనైపుణ్యము తీసికట్టు. ఆహా! నిద్దంపుటద్దంబులువోలెఁ బ్రకాశించు నీ విఠ్ఠలేశ్వరాలయశిలావేదికలందు మోముచూచుకొని చక్కదిద్దుకొనవచ్చు. హజార్ రామస్వామి దేవళ సమీపముననున్న రాతిరథమునిగాఁడి చిత్రములందలిశిల్పము లోకమందెచ్చుటను గానము. అన్నింటికంటె మిన్నయైచెన్నారు నావిఠోబా స్తంభమునుండి వెల్వడు సప్తస్వరములరాగఫణితి నెంతని కొనియాడఁగలను? మజ్జారే! తోటలన్నియు నందనోద్యానవనములే! బాటలన్నియుఁ బాలగచ్చుతో నిర్మింపఁబడినవే. కోటలోని హర్మ్యములు హాటకనిర్మితములు. బోటులనీటుగోటు లప్సరఃపాటలగంధుల సౌందర్యపాటవంబునకు బల్లెపుఁబోటులు. భూసురులు సకలధర్మకర్మనిష్ఠాభాసురులు. రాజు లసమానపరాక్రమమృగరాజులు. వైశ్యులు న్యాయవ్యాపారవశ్యులు. శూద్రు లత్యంతకృషికళాసముద్రులు. దీని యాస్థానమున జరుగు మహాకవిసత్కారములు వర్ణనాతీతములు. ఆహా! ఆంధ్రభాషోద్ధరణ కవతారమెత్తిన యవనీపాలుఁడీరాయలు. తెనుఁగుఁ దల్లిని సర్వాలంకారభూషితఁగాఁ జేయుసమకట్టినవిద్వద్వరేణ్యుఁడీ భూపాలుఁడు. ప్రజల మాతృభాషాభిమానమునకు మేరయే లేదు. పెద్ద సామ్రాజ్యము కావలయునా పెద్దన కావలయునా యని యడిగినచోఁ బెద్దనయే కావలయునను భాషాభిమానులే యందరును. రాజు కవిరాజు లేనిదే గడియయైన గడపఁడు. ప్రియమంత్రియగుతిమ్మరుసు లేనిదే రాచకార్యప్రసంగమే చేయఁడు. మా దేశములో 'లిస్బన్' మహానగర దుర్గమే మహావైభవమున మిన్నయని మేము మురియుచుందుము. దీని ముందది సూర్యునిముందు మిణుఁగురువంటిది. అబ్బా! ఈవీథి చూచినఁ గన్ను చెదరిపోవుచున్నది! ఆయేనుఁగుసాలలు చూచిన నా గుండె యదరిపోవుచున్నది. (ఎదుటఁబరికించి) ఎవరావర్తకుఁడు? కందుల రాశి ముందుఁబోసికొని యమ్ముచున్నాఁడనుకొంటినే! ఓహో! అదికందులరాశి కాదు. కెంపులరాశి. (ఆశ్చర్యముతో) ఆ దెసనదియేమి?

వజ్రములప్రోవు. అల్లదే నీలములబారు. ఇవి పచ్చలప్రోవులు. ఆ యంగడిముంగిలివి ముత్యాలకుప్పలు. ఇందులేనివి లోకంబునం దెందు నుండవు. ఈ పట్టణవైశాల్య మింతింతని చెప్పఁగలనా ? చెప్పఁజాల ! ఇటలీకిముఖ్యపట్టణమగు 'రోము' కంటె నిది మిక్కిలిపెద్దది. ఎక్కువ సుందరమైనది. ఇచ్చటినాగరికత యిచ్చటికట్టుబాటు లెచ్చటను గాన రావు. ఏమియీపట్టణభవననిర్మాణచాతుర్యము ! ఒక్కస్త్రీయైనను నన్యులకంటఁబడకుండ నూరిలోని యుత్సవములన్నియు నిరాటంక ముగాఁ జూడవచ్చు. ఎచ్చటఁజూచినను రాజు "ఊఁ" అనుసరికి నెంత బలవద్విరోధినైన నెదుర్కొని సింగపుఁగొదములవలె మీఁదికురుకు మహాయోధులే ! మందునకైన నిందుఁ బిరికిబంటు కానరాఁడు. కుందేలు వేఁటకుక్కను దఱిమితఱిమికొట్టిన వీరక్షేత్రమఁటయిది అఖండతపశ్శాలియగువిద్యారణ్యనిర్మితమైన శూరభూమియఁటయిది. ఇది లక్ష్మీసరస్వతులకు లాస్యభూమియనిన నపహాస్యమా ? అద్దిరా ! ఈపేటయందుఁ దాటిబద్దలతో నిర్మించినరాట్నము లేనికొంపయే లేదు. ఏకులు 'తయారు' చేయు నాచాకచక్యమేమి? కదురున సన్ననిదారము తీయు నానైపుణ్యపుణ్యమేమి ? పలురకముల తలతలలాడు చిలుపలు చుట్టు నానేర్పేమి ? ఈదేశవైభవమంతయు నీరాట్నములమూలము ననే మూర్తీభవించినదని చెప్పనొప్పు. ఈరాట్నచక్రనాదము వీణా నినాదముతో వాదులాడుచు శ్రోత్రపేయమై నన్నవశునిఁగానొనర్చు చున్నది. బళిరే ! ఇట్టి నగరసంబంధమునఁ వర్తకముచేసి కుబేరులము కావచ్చుననుతలంపుతో వచ్చి శ్రీకృష్ణదేవరాయలవారిదర్శనముచేసి నాశక్తియుక్తులనెల్ల నుపయోగించి యత్నించితి. కాని వర్తకమున కొక్కరేవుపట్టణమైన నిచ్చుట కాతఁ డంగీకరింపఁడయ్యె. పరభయం కరచతురంగబలఘ్నములగు శతఘ్నుల నిచ్చెదనని రాయలకానపెట్టి నను నాదెసకు మొగ్గఁడయ్యె. ఎనుటివీరులకు సమానాయుధము

లున్నప్పుడే యుద్ధముచేయునుగాని భిన్నపరికరములతో యుద్ధము చేయననుప్రతిజ్ఞగలవాఁడట యీతఁడు. ఈరాయలను మహాధర్మాత్ముఁడనుకొందునా ? వట్టివెఱ్ఱివాఁడనుకొందునా ? నేనువచ్చినకార్యమున కానుకూల్యమేమియుఁ గన్పట్టుటలేదు. (యోజించి) ఇంకెవ్వని వేడుకొందును ? బీజపూర్ సుల్తానాదిల్ షాకూడ మంచివాఁడని వినియుంటి. భామినీసుల్తానులకును విజయనగరప్రభువులకును బూర్వమునుండియు వైషమ్యములుగలవనియుఁ దెలిసికొంటి. ఇదేమంచిసమయము. రెండవకంటికిఁదెలియకుండ ఫిరంగులనిచ్చెదనని యాదిల్ షా కెరపెట్టి యెట్లైన రేవుపట్టణములనిర్మించుకొని వర్తకస్వాతంత్ర్యసౌకర్యములు సంపాదించితీరెద. (నిష్క్రమించును)

---

## రెండవరంగము

(కొలువుకూటము. కృష్ణరాయలు - తిమ్మరుసు ప్రవేశింతురు.)

తిమ్మ:—రాజేంద్రా! కటకపురమ్ము గెల్చితివి. సకలరాజ్ఞీలక్షణంబుల విరాజిల్లు తిరుమలదేవిని మనసారఁ బ్రేమించు భార్యగాఁ బడయఁగల్గితివి. వీరాగ్రేసరా! నీకింకఁ గొఱంతయేమి ? కాని......

రాయ:—అప్పాజివంటి ధీశాలిమంత్రియైయుండ రాయలకుఁ గొఱంతయేమి ? అప్పాజీ! కాని యని యూరకుంటివేల ? వేఱొండు రాచకార్యమేమైనఁగలదా? అట్లైన నెట్టిదుర్ఘటకార్యమైనను సంఘటింప బద్ధకంకణుఁడనై యుంటిని తెల్పుడు.

తిమ్మ:—ఏమని తెల్పుదును ? నెలలోపలఁ దిరుమలాంబా రాయలకుఁ బట్టాభిషేక మొనర్చినవెనుక రాచకార్యములు చక్కఁబెట్టవచ్చునని తలంచితిని కాని యిప్పుడు బలవత్తరరాజకార్యము వేఱొండు సంఘటిల్లినది. బహామినీ సుల్తాను లిప్పు డేకీభావము

వహించి పెచ్చుమీఱినట్లు తెలియవచ్చినది. మనమిప్పుడు మూకీభావము వహించినచోఁ దప్పక గొప్పముప్పు వాటిల్లఁ గలదు. మఱియు రాజేంద్రా !

గీ. ప్రక్కబల్లెంబు రిపులకు రాయచూరు
దుర్గ మెట్టివారలకైన దుర్గమం బ
దేరిపాలనయం దుండు వారి కెపుడుఁ
గరతలామలకము సు మ్మఖండజయము.

మన మట్టిరాచూరు కోటఁబట్టకుండుట సామ్రాజ్యలక్ష్మిని సర్వాభరణభూషితురాలుఁగా నొనర్చి తిలకంబుదిద్దుట మానుటవంటిది.

రాయ:—(యోజించి) మంత్రిశేఖరా ! మీరన్నదివాస్తవమే కాని యాదిల్‌షాతో మన మేమని వైరము బెట్టుకొందుము ? ఇప్పు డాంధ్రదేశ మెంతశాంతియుతముగా నున్నది ? హిందూ మహ మ్మదీయు లెంతయన్యోన్యసహాయసంపదున్నతులై మెలంగు చున్నవారు ? మతద్వేషము మానవద్వేషము సంఘద్వేషము నొకటనేల యెందును నీషద్ద్వేషభావమునులేక పరస్పరప్రేమ పాశబద్ధులై క్షీరనీరన్యాయమున సంచరించుచుండిరి. బీజపూరు సుల్తానాదిల్లాకూడ నియ్యుద్యమమున కూఁతమిచ్చుచున్న సుహృదుఁడుగదా !

ఉ. ఆదిలుపాయసంగ హృదయమ్ములరెంటినిఁగల్పి స్నేహమున్
బాదుకొనంగఁజేసి సుగుణప్రవరుండని వాసిగన్నవాఁ
డేదియు నేరమే దొరక దెప్పుడు నాతనియందు శాంతుఁ డ
త్యాదరణీయుఁ డొప్పుఁడు హితాగ్రణిపై కెటుకాలుద్రవ్వుదున్.

తిమ్మ:—అది న్యాయసమ్మతమే. కాని మొన్నమొన్నటిదాఁక నాదిల్‌షా దేవరవారియెడ నత్యంతప్రీతితో మెలఁగినవాడను టకు సందియములేదు. రాయచూరు దుర్గాధిపతియగు తోఫల్

ఖానుఁ డతిక్రూరుఁడు. గోలకొండనబాబుసేనాధిపతియగు మల మలఖానుఁడు చండశాసనుఁడు. ఉదయగిరి దుర్గాధిపతి ప్రహ రేశ్వరపాత్రుఁడు శత్రుకూటమునఁ జేరినాఁడు. ఇంకను దమ ప్రతాపాగ్నికిఁ దాళలేక పారిపోయినగజపతిసామంతులం దరిప్పు డేకరాశికి వచ్చి యాదిల్‌షాతో నేస్తముగావించి వానినిఁబ్రోత్సహించి మిమ్ము వంచింపయత్నించుచున్నారు. రాయలుసాకు పరమాప్తుఁడు. ఎట్లుమోసగింతునని పైపైకిఁ బలుకుచున్నాఁడేకాని యాదిల్ షా చాలకాలమునుండి లోలోన గోతులు తీయుచునే యున్నాఁడు.

**రాయ:**—(తలపంకించి) మీరనినట్లు తక్కినవారు తిరుగుబాటొనరించు టకుఁ దఱివేచియుండవచ్చునుగాని యాదిల్‌షావంటి సహృ దయుఁ డట్లొనర్చునా ? మనకట్లనుటకేమి యాధారముున్నది ?

**తిమ్మ:**—మంచిమాట సెలవిచ్చితిరి. తగిన యాధారములు మీకిప్పుడే చూపెద. మనకు పారశీకాశ్వముల నిచ్చెదనని చెప్పి లక్షలఁ కొలంది ద్రవ్యమును దీసికొనిపోయిన సయ్యదహమ్మదాదిల్‌షా యాస్థానముననున్న సంగతి మీకును విదితమైనదే కదా !

**రాయ:**—ఔను, నిజమే.

**తిమ్మ:**—ఆదిల్‌షా వాని కభయహస్తమిచ్చి మనకిచ్చెదనన్న గుఱ్ఱ ముల నన్నింటి కాతఁడే క్రాయకుఁడగుచు నాశ్వికదళమును బలపఱచుచున్నాఁడు. "ద్రోహి యగు సయ్యదు మీమఱుఁ గున దాఁగినాడు. విచారించి తగినట్లు శిక్షింపు" డని మనము వ్రాయఁగా నందులేఁడని బొంకి పిదప నాతఁ డిచ్చిన పెంకె జబాబు మీరెఱింగినదేకదా ! ప్రభూ ! అతఁడు మనకు నిజ మైన స్నేహితుఁడే యైనచో మన యెడ ద్రోహ మొనర్చిన సయ్యదును శిక్షింపవలదా ?

రాయ:— ఔను. అది తప్పిదమనక తప్పదు.

తిమ్మ:— ఇట్టి వెన్నెన్నియో కలవు. మొన్న పోర్చుగీసు వర్తకుడు గోవాపట్టణము లిమ్మని మనలను గోరగా మన మంగీకరింపమైతిమి. అతడు పోయి యాదిల్‌షా నాశ్రయించెనట. వారును నాతని సాహాయ్య మపేక్షించుచుండిరట.

రాయ:—ఎందులకో ?

తిమ్మ:—ఎందులకో యన నేల ? విజృంభించుచున్న రాయుల ప్రతాపాగ్నిం జల్లార్చుటకు. పరివ్యాప్తమైన యాంధ్రరాజ్యము నంతరింపజేయుటకు. గోవా డయ్యూ డామన్, రేవుపట్టణముల నాతడు పోర్చుగీసువారి కిచ్చివేసెనని మొన్ననే మనవిచేసికొంటిని. రాయచూరు మనము త్వరలో స్వాధీనముచేసికొనమేని పెక్కుచిక్కులు వాటిల్లు. ప్రభూ ! అది యట్లుండనిండు. (జేబునుండి శాసనపురేకును దీసి) ఈశాసనము చిత్తగింపుడు. (చేతి కిచ్చును.)

రాయ:—(గ్రహించి) సాళ్వ నరసింహరాజు వ్రాసిన మరణశాసనము.

తిమ్మ:—చిట్టచివరి వాక్యమును గమనింపుడు.

రాయ:—(తిలకించి) విజయనగర రాజులకు రాయచూరాయువుపట్టు. దానినిం బట్టుకొనిననే కాని వారు చక్రవర్తి నామమున కర్హులుకారు. నేను జీవించియుండు నేని సాధించి తీయవాడనే. ఇదియే నాతుదికోరిక ...(నిట్టూర్పువిడిచి) అప్పాజీ! నాజనకుని పంపునదియే ? జనకులగు మీయాజ్ఞయు నదియేకదా ! మీవాక్యార్థము లద్దమువలె స్ఫుటతరములు. మీభావము లంభోనిధివలె గంభీరములు. తక్షణమే యాదిల్‌షా కడకు రాయబారమంపుడు. శాత్రవులను బెచ్చుపెరుగనీరాదు.

తిమ్మ:—చిత్తము. సర్వము సిద్ధము చేయించెద.

రాయ:—రాయబారము నామ మాత్రమేసుఁడీ! ఇంతకృత్రిమములగు పన్నాగములను బన్నువారు మన రాయబార మంగీక రింతురా ? వారి నిరాకరణమే మనకుఁ బ్రబల నిదర్శనము. (మందహాసముతో) అప్పాజీ ! ఈ మధ్య... కాశీవిలాసులై క్రొత్తక్రొత్త జ్యోతిషములు చెప్పఁ బ్రారంభించితిరి గదా ! ఈ యుద్ధము జరుగు కాలాకాలములు జయాపజయములు నిర్ణయింపలేరా? - లేక (నవ్వి) తెలిసినవిషయములేకాని చెప్పఁ జాలరా ?

తిమ్మ:—(నవ్వి-తనలో) తిరుమల సంగతి యేమని నన్ను నర్మగర్భంబుగాఁ బలుకుటయేకదా యిది. (ప్రకాశముగా) ప్రభూ! నేను నావిధాయక కృత్యమును మఱచుటలేదు. ఈ కంకణమును విప్పుటకొరకే నెల గడువుపెట్టియుంటి. ఇది క్రీ. శ. 1520 వ సంవత్సరము. మే నెల 19 తేదీని యుద్ధము ప్రారంభము కాఁగలదని తోఁచుచున్నది. అన్నివిధముల మనకు జయమే సూచితమగుచున్నది.

రాయ:—సకల విద్యాపారంగతులు మీరెఱుంగనిదేమి కలదు ? మహాప్రసాదము.

(నిష్క్రమింతురు.)





శ్రీ

# తిరుమలదేవి నాటకము

## సప్తమాంకము

### మొదటిరంగము

కృష్ణానది కావలిబహిరంగము—రాయచూరునకు రెండుమైళ్ళ దక్షిణ మున వరుసగా ఫిరంగులు పాతఁబడియుండును.

(తిమ్మరుసు రాయలు గోవిందరాజు మొదలగువారు ప్రవేశింతురు.)

రాయ:—అప్పాజీ! ఏడులక్షల మూడువేల కాల్బలముతో ముప్పది రెండువేల యారువందల యశ్వదళముతో నైదువందల యేబది యొక్క యేనుగులతోఁ గృష్ణదాటివచ్చితిమి. తలవనితలంపుగా మనకిప్పు డవిలంఘ్యమగు భయంకరాపద తటస్థమైనది. ఈ మూలనుండి యామూల కడ్డముగా మార్గనిరోధకమై ఫిరంగు లమర్పఁబడియున్నవి. మనకు ఫిరంగులులేవే! యుద్ధమూని వెనుకకుఁ బోవుట శౌర్యమానవంతుని లక్షణముకాదుగదా! ఫిరంగులయగ్నిజ్వాలా మాలికలకు మనసైన్యములు మలమల మాడిపోవుటయేకాని రవ్వంతయుఁ బ్రయోజనము కానరాదు. ధర్మయుద్ధము ధర్మయుద్ధ మని మనము మొత్తుకొంటిమిగాని శత్రువు లావంతయు న్యాయము విచారింపరైరి. (పండ్లు పటపట కొఱుకుచు) మిత్రద్రోహి ఆదిల్‌షా యింతపనిచేయునని

కలనైనఁ దలంపనైతి. అప్పాజీ! ఇప్పుడు కర్తవ్యమెద్ది? కార్యములు గట్టెక్కించు నేర్పు మీకుఁగాక యింకెవరికిఁ గలదు?

తిమ్మ:—(పరికించి) ఔరా! ఇప్పు డెట్టియాపద దాపరించినది? ద్రోహము! ద్రోహము! వెనుకకు మరలిపోవుటయే గాని వేఱొండు దారి కానరాదు. ఆంధ్ర రాజ్యభూమీరుహ మూలమునకు గొడ్డలిపెట్టు. రాజేంద్రా! ఎఱిగియెఱిఁగి యింత సైన్యమును భయంకరాగ్నిజ్వాలామాలికల పాలొనర్తురా. వృథా ప్రయాసము. సర్వసైన్యనాశనము! తుదకుఁ బరాజయము.

మ. అవమానంబని వెన్కకున్ మరలఁబో కాలస్యమున్ జేయుచో
నవనీపాలక! శత్రుసైన్యనివహం బంతఃశ్శతఘ్నీకదం
బ వలత్పావకకీలికాళిఁ గురియింపంగాఁ మనచో న్నిక్కమ్
రవరుల్ సైతము నిల్వనోపుదురె పోరం బాఱ కెబ్భంగినిన్.

రాయ:—(క్రోధముతో) ఏమి? వెనుకకుఁ బాఱిపోవుటయా! అప్పాజీ?

గీ. ధైర్యసాహస విక్రమధనుఁడు ఘనుఁడు
చతురుపాయపరాయణుఁ డతులమాన
నీయుఁడగు తిమ్మరుసునోట నేఁటి కిట్టి
పిరికిమాటలు వెడలుట వింతగాదె?

తిమ్మ:—రాజేంద్రా! పిరికిమాటయా! కాదు. రాజనీతివాక్యము. ఏయెండ కాగొడుగు పట్టుకున్నఁ బట్టభద్రులకైన నొక్కొక్క పట్టునఁ జెట్టలుపుట్టవా! పాండుబిడ్డ లెవరైన నెదురుగాఁ గాల్పు చాతురా! వీరావేశమున సర్వసైన్యమును నాశనము చేసికొని ధాత్రీశ్వరులు తమకును దమ దేశంబులకును హాని గల్పించుకొననగునా! అశ్వత్థామ నారాయణాస్త్రమును ప్రయోగించినప్పు డర్జునుఁడంత మహాయోధుఁడు నిరాయుధుఁడై రథముదిగి నమస్కరింపలేదా?

రాయ:—(కనులెఱ్ఱఁజేసి) ఉగ్గుఁబాలబెట్టిన ధైర్యస్థైర్యములకు స్వస్తి చెప్పుదుమా! నిర్వక్రపరాక్రమమును గంగపాలొనర్తుమా! మానధనుఁడు మరణమునకైన సిద్ధపడునుగాని వెన్నిచ్చి పారిపోవునా! పుట్టినవంశమునకుఁగీర్తిఁజేపట్టిన పట్టణమునకుఁగూడఁ జిరస్థాయియగు నపకీర్తినార్జింతుమా!

గీ. విజయలక్ష్మిని వెలయించి వెలయునట్టి
నగరమగుటఁగాదె విజయనగరమయ్యె
జయము గనుటొండె నిచ్చటఁ జచ్చుటొండె
ఓడి నగరికిఁబోవ నెట్లొప్పుకొందు.

అప్పాజీ! అసమానపరాక్రమఖనియగు తిమ్మరుసుచేతిక్రింద నాఱితేరిన రాయలు పారిపోయెనన్న నిందనోర్చుటకన్న నీఫిరంగిగుండ్ల కగ్గమై ప్రుగ్గికీర్తినందుట మిన్నగాదే?

తిమ్మ:—సెబాస్! సింహపరాక్రమా! సెబాస్! సాహసముగలవారిని లక్ష్మి వరింపకుండదు. ఈ దుస్థితిని సూచించితి నంతియే మీయాజ్ఞకు బద్ధుఁడను.

రాయ:—అప్పాజీ! సకలసైన్యమును వీరాలాపంబులఁ బ్రోత్సహించి ఫిరంగులను దాఁటిపోయి కోటఁబట్టుటకు విజయమొందుటకుఁ దగునుపాయంబు నారయుఁడు. మీ కుపాయముల కేమి లోపము? కొండమ్రింగువానికి గోపురమడ్డునా? నేనిదేవచ్చెద సత్వర ముపాయమాలోచింపుడు.

(నిష్క్రమించును.)

తిమ్మ:—(యోజించుచు) ఉపాయము! ఉపాయము!! ఇంకెక్కడి యుపాయము? ఔరా! ఈ యాపత్సముద్ర మీదుట కాలోచనానౌకయే దొరకుట దుర్లభముగానున్నది. ఆంధ్రరాజ్యము నేఁటితో నంతరింపవలసినదేనా? దైవమ్మా! (యోజించుచుఁ

దటాలున) ఆ! మంచియుపాయము! రాయలుసంకల్పసిద్ధుఁడు. తరించితితరించితి(సైనికులదిక్కు మొగంబై)ఓమహాయోధులారా! మీబాహుబలపరాక్రమముమీఁదనే మీసాహసౌదార్యముల మీఁదనే మీత్యాగసంపదమీఁదనే యీకర్ణాటసామ్రాజ్య లక్ష్మి యీయాంధ్రరాజ్యేందిరయాధారపడియున్నది. ఇప్పుడు కృష్ణదాఁటి యీవలకు వచ్చితిమి. తలవనితలంపుగా నిచ్చట మహాపద సంభవించినది. ఇందనుక నెందరెందరో వీరస్వర్గ మలంకరించి రాజేంద్రునకుఁ బెక్కుయుద్ధములం దఖండవిజ యంబు చేకూర్చిరి. దేశభక్తి మూర్తిభవించినది. ఆంధ్ర దేశాభిమానము వెల్లివిరిసినది. ఆంధ్రతేజము దిగంతముల ధగద్ధగాయమానముగా వెలుంగుచున్నది. ఆంధ్రపరాక్రమము క్రేళ్లువాఱినది. మునుపుచూపినభక్తి భక్తిగాదు. తొల్లి నెఱపిన పరాక్రమము పరాక్రమముగాదు. పూర్వము ప్రకటించిన ధైర్యము ధైర్యముగాదు. రక్తపాతముగాక రాజ్యమార్జింప నగునే? మనము కోటపట్టుకొనుట మొదలుపెట్టితిమేని లక్షల కొలది సైనికులు మరణింపకమానరన్నసంగతి మీరెఱుంగ నిదియుఁగాదు. కోటపట్టుకొని జయముగాంచుటో లేక ఫిరంగి గుండ్లబారి కగ్గమయి మ్రగ్గుటో తప్ప పిరికిపందల మనిపించు కొనరాదు.

(వీరులుముందువచ్చి) ఛీ! పిరికిపందలమా? దేశమాతకు మా ప్రాణములర్పింప నంసిద్ధులము. ప్రళయాగ్నిజాలలందైన నుఱుకుదుము మేము! మేము!

తిమ్మ:— సెబాస్! వీరాగ్రేసరులారా! నేను చెప్పానుపాయమును చక్కగా గమనింపుడు. అటుచూడుడు. ఆ యమర్చఁబడిన ఫిరంగులకు మధ్యమధ్యనెంతయో దవ్వుగలదు. ఆమూలనుండి

కాని యీమూలనుండికాని మధ్యనుండికాని పోయి కోటc బట్టుట కాబ్రహ్మకైన శక్యముగాదు. మీరు నిజమైన దేశ భక్తులే యైనయెడల నిజమైనరాజభక్తులే యైనయెడల మీ యాంధ్రసామ్రాజ్యలక్ష్మిని మీరు కాపాడుకొనcదలంచిన యెడల మీకు మీకన్నతల్లియెడ నిష్కళంకప్రేమయున్న యెడల శత్రువులు ప్రేల్చుచున్ననుసరే యీమూలనున్న మొదటిపదిఫిరంగులముఖముల కెదురుగాc బదిపదిమందివీరుల చొప్పునc బోయి యెదుర్కొనుcడు. అట్లుమూడుతడవలు తండాలుతండాలుగాcబోయి యెదుర్కొనవలయు. ఒక్కొక్క తడవకు వందమందివీరుల కెక్కు డుండరు. ఇట్లు మూడువందల మంది త్యాగముచేసినచో మొదటిపదిఫిరంగుల పస నాశనము గాcగలదు. ఒకసారి యుపయోగింపcబడినఫిరంగిని దట్టించుట కొకఘడియకాలము పట్టును. ఆపదిఫిరంగులవారు మందు దట్టించునంతలో వెనుకనున్న వారు ఫిరంగులను సమీపించి వారింబట్టిచంపవగు నంతలో సర్వసైన్యము ఫిరంగుల బారు దాcటి యన్నిఫిరంగులవారినిc బట్టుకొని చంపనగును. లక్షుల కొలందిగానున్న మీసోదరవీరులప్రాణములను రక్షించినవా రగుదురు. త్వరపడుcడు. పొండు. సాహసింపుcడు.

వీరులు:—ఆంధ్ర తేజఃపుంజము పరివ్యాప్తమగుcగాక! కర్ణాటసామ్రాజ్య లక్ష్మికి జై. శ్రీకృష్ణదేవరాయలకు జై. అప్పాజికి జై. ఆంధ్ర మాతకు జై.

(తండాలుతండాలుగాc బోదురు - ఫిరంగులుప్రేల్పcబడును)

రాయలు (ప్రవేశించి):—అమాత్యశేఖరా! మీతంత్రము లద్భుతము లనంతము లసమానము లఖండములుcగదా! అటు చూడుడు! మీయుపాయోపదేశానుసారముగా సైనికులు

తండాలుతండాలుగాఁ బోవుచున్నారు. కట్టా! మొదటితండా సైనికు లామహాగ్నికీలలకు భస్మీభూతులైరి. రెండుమూడు తండాలవారును - - ఔరా! రాజకృత్యమెంతకఠోరము?

తిమ్మ:—రాజేంద్రా! ఇట్టిరాజభక్తులు నిట్టిదేశభక్తులు నిట్టిశూర పుత్రులు నిట్టిత్యాగమూర్తులుగల దేశ మున్నతివహింపదా? రాజచంద్రుల కఖండజయము చేకూఱదా?

రాయ:—అప్పాజీ! ఈత్యాగమూర్తులకుటుంబములకు శాశ్వత జీవనాధారముగా నూరుపుట్లభూమి నాయాజ్ఞ నొసంగుఁడు.

తిమ్మ:—అదియెంతయు సమంజస మట్లేయొనర్చెద.

రాయ:—అప్పాజీ! మనసైన్యములప్పుడే చొచ్చుకొనిపోవుచున్నవి.

ఉ. చెప్పినచొప్పునన్ నడచి చేరి ఫిరంగులబారి కగ్గమై
రిప్పుడు సైనికుల్ మిగిలి యెల్లరు సందునొనర్చుకొంచు మే
లుప్పతిలంగఁ బట్టుకొనుచుండిరి శత్రుబలంబు లల్లవే
ముప్పునఁ బాఱఁజొచ్చెఁ ద్వదపూర్వమనోహరతంత్రపద్ధతిన్.

మనమును బాల్గొనఁబోవలయురమ్ము.

(నిష్క్రమింతురు)

---

## రెండవరంగము

యుద్ధభూమి-వెన్నెలరాత్రి-కృష్ణరాయలు ఖడ్గముఁ జేతఁబూని ప్రవేశించును.

ఈ మనోహరచంద్రచంద్రికాపూరంబునఁ బ్రళయకాలావిర్భూత మేఘమాలికలలీల రెండుసైన్యములవారును వెల్వడి తారాపథము దద్దరిల్లఁ బృథ్వీతలంబు క్రుంగ భటుఁడుభటుఁడుదాఁకి ఘోరసంగర మొనర్చుచుండిరి. అప్పాజి ధైర్యసాహసము లప్రతిమానముః భార్గవ

ద్రోణాది మహాయోధులచందంబున సీభూసురశ్రేష్ఠుఁడు భుజబలంబు మెఱయ సన్నద్ధుండై గండుమీఱియున్నవాఁడు. అదె! యెంతమంది వైరివీరులనుఁజీల్చి చెండాడుచున్నాఁడు! శాత్రవవీరులకరములఁ గరము విరాజిల్లు నాయుధములఁ దుత్తునియలు చేయుచున్నాఁడు. (మరియొక దెసకుఁదిరిగి) ఔరా! ఈదెసనింతకంటె నతిభయంకరసంగర మొనర్చు వాయువకవీరుఁడెవ్వఁడు! లాఘవలక్ష్యశుద్ధి దృఢత్వచిత్రత్వంబులు మెఱయ నాకారముదాల్చిన ధనుర్విద్యయోయనఁ బ్రకాశించుచున్నవాఁడు. అతివేలములైన వార్ధులంబోలు మహాసైన్యమునం దుఱికి యెవ్వరిని లెక్కచేయక యుక్కుమీఱి పెక్కువీరుల నుక్కడంచుచున్నాఁడు. (మరియొక దెసకుఁ దిరిగి) ఏలొకో యీదెస సైనికులు పలుచంబాఱుచుండిరి. ఏనిదే పోయి వారినిఁ బ్రోత్సహించెద.

(నిష్క్రమించును)

(తిమ్మరుసు ప్రవేశించును)

మధ్యందినమార్తాండుని ఖరకిరణముకరణి మెఱయుఖడ్గరాజమును చేఁబూని మారాయలు లోకాతీతప్రతాపమును బ్రకటించుచున్నాఁడు. వెనుకంజవేయక ప్రళయకాలరుద్రునిచందంబున విజృంభించి సాధనోపాయముల రాయలు విరోధిసైన్యముల లయమొనర్చుచుండె. కాని ప్రయోజనము గగనకుసుమముగానున్నది. (ఒకదెసకుఁజూచి) ఆ! ఆదెస నదియేమి? మలకదంతు మిడుతలదండువలెఁ జెలరేగుచున్నది. క్రొత్తసైన్యములువచ్చి చేరుటచేఁ గ్రొత్తనీటనిండు నిండు వాహినివలె వెల్లివిరియుచున్నది. ఆంధ్రవీరులు వెనుకంజవేయుచున్నారు. ఛీ! పౌరుషహీనముగాదా? ఓ యాంధ్రవీరులారా? భీరుతాపిశాచమును బారఁద్రోలుఁడు. పాఱిపోకుఁడు. నేనిదే మీసహాయార్థము వచ్చుచుంటి.

(కత్తిఁద్రిప్పుచు విజృంభించి నిష్క్రమించును.)

(మహావీరుఁడు ధనుర్ధరుఁడై ప్రవేశించును)

ఆహా! రాజనినఁగృష్ణరాయలేరాజు. ధైర్యసాహసములు వాని సొమ్ము. పరాక్రమమున కాతఁడాటపట్టు. ఔదార్యమున కాధారము. ఉత్తమక్షత్రియకులాలంకారునియం దుద్భూతమగు నఖండక్షాత్ర తేజ మీతనియందు మూర్తీభవించినది. ఈతఁడు ధర్మసంస్థాపనార్థ మవత రించినకృష్ణుఁడనిన సందేహమా? (ఇటునటుపరికించి) ఆపద! ఆపద! శాత్రవు లల్లదే రాయలను మార్కొనుచున్నారు. ఓరీ! దురాత్ము లారా! ఈ రాజభక్తుని కంఠమునఁ బ్రాణములుండగా మీరు రాయల కాపద కలిగింపఁగలరా! (వింటబాణపరంపర సంధించి విడుచును – చిరునవ్వుతో) మా రాజు రక్షింపఁబడె. శత్రువులు పికా పికలై పారఁజొచ్చిరి. రాయల నెదిరించిన మును మువిఱిగిపోయినది. (మరియొకదెసకుఁజూచి).

ఔరా! ఈదెస నియ్యాంధ్రవీరులు శత్రుధాటికాగ లేకున్న వారే (నిరూపించి) పారిపోకుఁడు. నే నిదే మీసహాయార్థము వచ్చు చుంటి. (అటుపోయి మరలి వచ్చి) ఓ యాంధ్ర సేనాధిపతులారా! సైనికులారా! దశదిశలనిండి దేదీప్యమానముగా వెలుంగుచున్న యాంధ్రప్రతాపాగ్నిజ్వాలలను నేఁడు మీపిరికితనమను నీటిధారలచేఁ జల్లార్పఁజూచెదరా? ఛీ! మీకుఁ బౌరుషములేదా? ఆంధ్రరాజ్యము మనది. ఆంధ్రులము మనము. ఆంధ్రదేశము మనది. ఆంధ్రప్రతాప మసమానము. ఆంధ్ర తేజ మఖండము. ఆంధ్రవైభవమనుపమానము. ఆంధ్రసాహస మనాదిసిద్ధము. ఆంధ్రధ్వజ మాకాశవీథి నాచందార్కముఁ బ్రకాశింపఁజేయుడు. ఐకమత్యము సూచించు నాంధ్ర ధ్వజము–త్యాగధైర్యములకు గురుతైన యాంధ్రధ్వజము – శత్రురాజుల గుండెలు పగిల్చి రగుల్చు నాంధ్రధ్వజము – క్రిందఁబడినచో మీ తల లూడి నేలపైఁబడినట్లు గాదా? ఆంధ్రుల యశశ్చంద్రికలను మాసి పోనీక–యాంధ్రుల జయలక్ష్మిపంచబంగాళమైపోనీక – చెక్కుచెదరని–

యేనాఁడు మొక్కపోవని యాంధ్రతేజ మిప్పు డథ్వాన్నముకానీక కాపాడుఁడు. చంపుడు శత్రువులను ! చీల్పుడు వైరులను! ఆంధ్రరాజ్యలక్ష్మీశుంభద్ద్వారవరక్షణ దీక్షాపారయశోవిసరులు కండు. నాతోడ రండు. వైరివీర గంధద్విపకుంభస్థలమ్ములఁజీల్చి చెండుఁడు.

(నిష్క్రమింతురు.)

(మహావీరుఁడు మరల ప్రవేశించి) నా మనస్సెంత కుదుటఁబడినది. ఆదెస గోవిందరాజు తన యుద్ధ నైపుణ్యంబు మెఱయ నొక యొద్దుకాచుకొనియున్నవాఁడు. తిమ్మరుసు మాట వేఱ చెప్పనక్కఱయేలేదుగదా ! కృష్ణరాయల తలఁదీసి యప్పగించిన వాని కర్ధరాజ్యము నలుపాగా నిచ్చునఁట. ఎవరు ? ఆదిల్‌షాయఁట ! ఔరా రాజనీతి యెంత విపరీతమైనది ? అది యట్లుండనిమ్ము. (నలుదెసలఁ దిలకించి) జయము చేకూరెనని రాయ లుబ్బుచు గుడారమునకుఁబోవుచున్నాఁడనికదా తెలిసికొంటిని. ఆదిల్‌షా యెంతద్రోహి ? అయ్యో! ఒంటరిగాఁబోవు రాయల నర్థకాంక్షాపరులగు తురక సర్దారులు వేఁటాడ వెంటాడుచుండనలయును. నేనింకఁ దడయరాదు.

ఉ. రాయల యుత్తమాంగమును రాలుతురంట ! పరాభవాగ్నిలోఁ
ద్రోయఁగ నుండిరంట ! కడు రోతగదా ! విన నిట్టివార్త యౌరా ! యెటులోర్తు ! నాదుగళమందునఁ బ్రాణముగల్గఁ బ్రోజ్వల
త్సాయక ! పంక్తులన్ రిపు విదారణముంబొనరింపకుందునే !

(నిష్క్రమించును.)

---

## మూడవరంగము

ఖడ్గధారియై రాయలు ప్రవేశించును.

ఔరా ! కాలమహిమ ! విజయదర్పమున విఱ్ఱవీగుచు, నొంటరిగాఁబోవు నాకెంతటి పరాభవము! తోఫల్‌ఖాఁ? నీవెంత దురాత్ముఁడవు! ఆకస్మికముగా నన్నుబట్టి నాయుత్తమాంగము నుత్తరింపఁదలం

తువా ? కృత్రిమముగా నన్ను వధింప నెంచుట పౌరుషకార్యమా ? నీరక్తనాళములయందు మ్లేచ్ఛరక్తము ప్రవహించుటలేదా ఇంతపిరికి పందవా ? ధీరులొక్కపరియే మరణింతురు గాని భీరులు క్షణక్షణము చచ్చి బ్రదుకుచుందురని యెఱుంగవా ? ఆహా ? నాతో [illegible]యుటకు సిద్ధముగానున్న తురకసర్దారులను గ్రూరుఁడగు తోఫల్ ఖాను నిజ బాణపరంపరలఁ దున్మి తూటాడి నన్నీమహాపదనుండి యుద్ధరించిన యామహావీరు డెవ్వఁడై యుండునోవు ? (నలువలంకులఁ దిలకించును.) (మహావీరుఁడు ప్రవేశించి) ఓ దురాత్ములారా ! సర్దారులారా ! తిరిగి చూచెద రేల ? (బాణములు సంధించి విడుచును.)

రాయ:—(ఆనందముతో) మహావీరా ! మేము నీఋణ మెట్లుతీర్చు కొనఁగలము ? ఈయుద్ధమునం దనేకపర్యాయములు మాకుఁ బ్రాణదాన మొనర్చిన మహోపకారివి. మా సంతోషసముద్రమునకు మేరయేలేదు. నీరాజభక్తి యనుపమానము. నీవిలు విద్యావైశారద్య మనవద్యము. (పరిశీలించి) మహావీరా ! ఆకారమునందు మృదుత్వమును నాహవమునందుఁ గాఠిన్యము గన్పట్టు నీచరిత్రచూడ మాకు విచిత్రముగా నున్నది.

ఉ. ఓ కమనీయరూపసుగుణోజ్వల ! సింహపరాక్రమక్రమా !
నీకులగౌరవంబును జనించిన పట్టణరాజమున్ వినన్
మాకు ముదంబుగల్గెడునుమా ! యదియేలొకొ నిన్నుఁ గాంచినన్
గాకరకాంతచందమునఁ గాయమునన్ బులకల్ జనించెడిన్.

మహా:—(చేతులుజోడించి) ప్రభూ ! మీకంటె వీరాగ్రేసరులెవ్వరు? మీ యాశ్రితులమగు మాయెడ నట్టి యనురాగము గల్గుట సహజమేకదా ! వెండియు,

ఉ. శూరులఁ గాంచినప్పుడును శూరుల ధైర్యపరాక్రమంబు క
న్నార రణాంగణక్షితిని నారయునప్పుడు విన్నయప్పుడున్

ధారుణిపై ధనుర్ధరపథంబున వర్తిలురాజపాళి కో
రౌర వచింపనేల హృదయాంబుధి పొంగదె కృష్ణభూవరా ?

రాయ:—ఇంతకు మీ యమూల్యనామంబు వచించి మీ జన్మంబు
వినఁగోరుచున్న న న్నానందింపఁజేయుఁడు.

మహా:—రాజేంద్రా ? పేరివలననా గౌరవము గుణమువలననా ?
నన్ను మహావీరుఁడందురు. జన్మంబందురా (నవ్వి) అదియేటికి?
ఎవరి పుట్టుపూర్వోత్తరము లెవ్వ రెఱుంగుదురు ?

క. శూరులజన్మంబును బృం
దారకులభవంబు ధరణినాథుల జననం
బేఱుల యుత్పత్తియు నే
వారికి నెఱుఁగంగనౌనె వసుధాధీశా !

రాయ:—(తనలో) వీనిభావగర్భితవాక్యము లెంతముగ్ధత వహించి
యున్నవి ? (ప్రకాశముగా) నీ మహావీరత్వము విలోకించి
మహావీరాయని సంబోధించితిమి. అదిసార్థకనామమే యయ్యె!
మహావీరా! నీసాహస మప్రతిమానము. మాకెంతయు మెచ్చు
వచ్చెఁగాని,

ఉ. చూడ మృదుత్వసంపదలశోభిలుచుండు భవత్కరంబునన్
వాఁడిశరంబు లుప్పతిలి వైరినికాయము నెంతయేనియున్
గాడగఁజేసె నిప్పు డనఘా ! జలదాంతరమందునుండి క్రొ
వ్వాఁడిమెఱుంగుబల్ పిడుగుపంక్తులు వెల్వడుచంద మౌ యనన్.

(ఖడ్గధారి తిమ్మరుసు ప్రవేశించి)

రాజపుంగవా! హతశేషమైనబీజపూర్ సుల్తానుసైన్యమంతయుఁ
బలాయనమైనది. (మహావీరునివంకఁదిరిగి) ఓహో ! ఈమహావీరుఁ
డిచ్చటనేయుంటివా ? మహావీరా ! నీవు ప్రభువులప్రాణదాతవుగదా

మహా:—నా ప్రభువునరక్షించుట నాప్రాణమును రక్షించుకొనుట కాదా ? మంత్రిశేఖరా ? ఎంతభయంకరయుద్ధము చేసినను జయము మనదేయనుకొన్నను కోటమాత్రము స్వాధీనము కాలేదు. నేటికి బాహ్యయుద్ధము సమాప్తమైనది. కోట దుర్భేద్యమనియు బలిష్ఠమైనదనియుఁ బ్రతిపక్షులు హాయిగా నిప్పు డందు గుండెపైఁ జేయివేసికొని నిద్రించుచుండిరి. నే నను దినంబును బ్రచ్ఛన్నుఁడనై రహస్యమార్గమునఁ బోయి నిశా సమయంబులఁ గోటలో మెలంగుచు శాత్రవులగుట్టుమట్టులను జక్కగాఁగనిపెట్టుచునేయుంటిని. మీరెంతకాలము వేచినను బలిష్ఠమగు నీదుర్గము స్వాధీనముకాఁజాలదు.

తిమ్మ:—దుర్గరహస్యములన్నియు నెఱింగిన నీసహాయమున మేము కోటస్వాధీనముఁ జేసికొనఁజాలమా ?

మహా:—సందియమా ? రేపీపాటికే యిచ్చటనే మనము గలిసికొని ప్రచ్ఛన్నులమై కోటలోనికిఁబోవుదము. రహస్యములన్నియుఁ దెల్పెద.

రాయ:—మంచిది. అప్పాజీ! విశ్వాసపాత్రుఁడగుమహావీరుఁడు మనకుఁ జేయరాని దేదికలదు.

తిమ్మ:—విజయసర్వస్వ మతనిదే. అట్లేకావింతము.

(నిష్క్రమింతురు)

(మరునాటిరాత్రి—రంగము-రాయచూరుదుర్గములోపలిభాగము)

(మహావీరుఁడు, రాయలు, తిమ్మరుసు ప్రవేశింతురు)

మహా:— రాజేంద్రా! దైవకృపవలన నిర్భయముగా నీరహస్యపర్వత గుహాద్వారమున దుర్గములోఁ బ్రవేశించితిమి. ఈరెండును సకలాయుధాగారములు. (రెండుతాళములను తిమ్మరుసునుచేతి కిచ్చి) ఈబీగములచే వీనిని బంధింపుఁడు.

తిమ్మ:—ప్రభూ! ఈమహావీరుఁ డవమానశేషుమీమంతుఁడు (అట్లొనర్చును)

మహా:—రాజా! ఇది సింహద్వారము. మనయేనుఁగు లెంతడీకొన్నను గవాటములు వ్రీలకుండుటకుఁ గారణమరసితిరా?

రాయ:—చక్కఁగా గమనించితివి. తలుపుల కావలివైపుననున్న యినుప గుబ్బలు మదగజంబుల కుంభస్థలములను జీల్చుటచే సాధ్యముకాలేదు.

మహా:—మంత్రిపుంగవా? ఇటుచూడుడు. ఈద్వారముప్రక్క ద్వారపాలకుఁడు నిల్చుట కొఱకరహస్యస్థల మేర్పాటు కావింపఁబడినది. ఈ గోడ యిక్కడమందము తక్కువ.

తిమ్మ:—మహావీరా? మూలబలమున్న తావేది?

మహా:—(పరిక్రమించి) అల్లదే బలఁగమున్న తావు (ఇటునటు సూచి) రాజామాత్యులారా! అలికిడి వినవచ్చుచున్నది. మనము సత్వరమ సర్వమును జక్కఁబెట్టుకొనిపోవలయును.

తిమ్మ:—మహావీరా? రాజశేఖరా! త్వరపడనక్కఱలేదు. కోట వెలుపల మనసైన్యమంతయు సిద్ధముగానేయున్నది. మూయఁబడిన దుర్గద్వారములు తెఱచినచ్చెద. సకల సైన్యము లోనఁ బ్రవేశింపఁగలదు.

రాయ:—మంచి యుపాయము. నేనును మహావీరుఁడును ఖడ్గధారులమై కాపాడుచుందుము.

తిమ్మ:—(మెల్లఁగాఁబోయి కోట తలుపులు తెఱచును.) రాయల సైన్యము లోనఁ బ్రవేశించును. కోటలోనివారు మేల్కని యిటునటు పరుగెత్తుచు శత్రువుల నెదుర్కొందురు.)

(తెరపడును.)

---

## నాల్గవరంగము

(రాయచూరుకోటలో-రాజమందిరము-రాయలు తిమ్మరుసు సింహాసనాసీనులై ప్రవేశింతురు)

పెద్దన-తిమ్మన-ధూర్జటి-రామలింగము-భట్టుమూర్తి-పరివేష్టింతురు.

తిమ్మ:—రాజేంద్రా! దుర్భేద్యమగు రాయచూరు దుర్గమును నాదిల్షావంటి మహావీరుని జయించిన మీకీర్తిహంసి నభోంతరాళమున నిచ్చవచ్చినమచ్చున సంచరించుచున్నది.

రాయ:—ఆ హంసికి మీాయసాధారణోపాయములేకదా పక్షములు. తత్పక్షవిహీనహంసి యెట్లెగురఁగలదు?

తిమ్మ:—ప్రభూ! వీరాగ్రేసరులకుసైతము వెఱపుఁబుట్టించివింటి కహాకహార్భటుల దిక్తటుల నించి కదనముల మిమ్ముఁగాపాడిన యామహావీరుఁడే మీకీర్తిహంసికిఁబక్షద్వయము.

రాయ:—అప్పాజీ! ఆ మహావీరుని ఋణము మనమెట్లు తీర్చుకొనఁగలము? వానిం దోడ్కొని రాఁబోయిన విజయు డింకను రాలేదేల?

తిమ్మ:—భూవరా! ఆ వీరవరుని చాకచక్యము సాహసము విలువిద్యానైపుణ్యము కార్యసాధనోపాయ సంపత్తి యనన్యసామాన్యములు.

(విజయుఁడు మహావీరునిఁ దోడ్కొని ప్రవేశించును.)

విజ:—ప్రభూ! మహావీరు లరుదెంచినారు.

రాయ:—జాగేల? సత్వరము ప్రవేశపెట్టుము. (ఖడ్గధారియై మహావీరుఁడు ప్రవేశించి జోహారొనర్చి నిలచును.)

రాయ:—మహావీరా! ఈ యాసన మలంకరింపుము.

మహా:—(ఆసనాసీనుఁడగును.)

తిమ్మ:—మహావీరా ! రాయలవారు మీ కెంతయుఁ గృతజ్ఞులు.

రాయ:—వీరాగ్రేసరా ! నీయాశ్రిత మేదియైనఁ దీర్చుట కీకృతజ్ఞుఁడు సర్వసంసిద్ధుఁడు.

మహా:—(మందహాసముతో) నాకుసందేహమే !

తిమ్మ:—ఏమి ? నీ కోర్కె నెఱవేర్పలేమనియా ?

మహా:—ఔను.

రాయ:—(మొగముఁ జిట్లించుకొనుచు) రాయ లాడితప్పువాఁడు నయుక్త కార్యము లాచరించు వాఁడు ననుకొనుచుంటివా ?

మహా:—కాదనుఁడు కోరు కొందును.

రాయ:—ముమ్మాటికిని—

మహా:—ఈ ఖడ్గమును మీచేత ధరించి నిలువుఁడు.

రాయ:—ఖడ్గమునుచేత ధరించి నిలుచును.

మహా:—(చేతులు జోడించి) దేవా ! నేను కృతజ్ఞతార్హుఁడనుగాను. మీపట్ల మహాద్రోహ మొనర్చితిని. ఈ కరవాలమున నాశిరము ఖండింపుఁడు.

తిమ్మ:—(ఆశ్చర్యముతో) అదెట్లు ?

రాయ:—నీ పలుకు లతివిరుద్ధములుగా నున్న వే !

మహా:—కాదు. (తలపాగను దొలఁగించి, యంగీ సడలించి)అవతార పురుషులగు మీయెడ ద్రోహ మొనర్చిన తిరుమలను నేను.

తిమ్మ:—(ఆశ్చర్యచకితుఁడగును.)

రాయ:—(ఆశ్చర్యానందములు పెనఁగొన) ఏమి ? తిరుమలవా ? నిర్దోషురాలవగు నా తిరుమల వేనా ? ఆహా ! ఏమినాభాగ్యము! (ఖడ్గముక్రిందఁబడవైచి యామెతలపాగఁబూర్తిగాఁ దొలగించి చేయిపట్టుకొని) దేవీ ?

సీ. ఆచంద్రతారమై యాలరంగ నాపేరఁ
బెనుతటాకంబుఁ ద్రవ్వించినావు
సపదిస్ఫుటాపదల్ సవరించి యనిలోనఁ
గనుఱెప్పయునుబోలె గాచినావు
తలదీయుటకు సిద్ధపడియున్న పగతుఱఁ
జెండాడి నన్ను రక్షించినావు
భేదింపఁగా రాని యీదుర్గ మవలీల
స్వాధీన మొనరింపఁ జాలినావు
గీ. మాకుఁబట్టపుదేవివై మసలుమీావు
తొల్లి చేసినచిరుతప్పు తొలఁగిపోయెఁ
జంద్రు నెడలఁ గళంకదోష మ్మొకండు
గణనచేతురె ప్రాజ్ఞులో కంబుకంఠి !

తిమ్మ:—(మహానందముతో) ఓ కర్ణాటసామ్రాజ్యలక్ష్మి! తిరుమలాంబా! మారాయలకు మిమ్ముఁగూర్చుటకుఁజేసిన ప్రయత్న మంతయు నేటికి ఫలించినది. ఆంధ్రరాజ్యసంస్థాపన దీక్షానిర్వహణము నేటికి పరిపూర్తియైనది. ప్రభూ! నాచేతికింక నీ కంకణబంధ భారమును దొలంగించెద (కంకణము నూడఁదీయును)

రాయ:—ప్రేయసీ! నీచెలిక త్తెయగుశ్యామలతో నీవు మున్ను “మ. వినుమీానాదుప్రతిజ్ఞ తత్పరతతస్వీ......” (అనుపద్యముచదివి) అని ప్రతిజ్ఞ చేసినావట. నిజమేనా ?

తిరు:—(మందహాసముతోఁదలవంచుకొనును)

రాయ:—నన్ను నీదోఃపాశనిబద్ధునిఁజేసితివి. నేను నీవంటియసమాన శౌర్యసౌందర్యాన్వితకాంతామణిచేతి క్రీడావస్తువనే యైతిని గదా! నీప్రతిన నెఱవేర్చుకొంటివిలే.

తిరు:—(మందహాసముచేయును)

తిమ్మ:—ఔను. దేవిప్రతిజ్ఞసార్థకమేయయ్యె (తిరుమలాంబా రాయల శిరములరెండుకిరీటములుంచును.)

(తిరుమలాంబారాయలుసింహాసనాధిష్ఠులగుదురు.)

రాయ:—అప్పాజీ ! మీవలెదంత్రొపాపములునడుప సమర్థులగు సచివాగ్రేసరులుగలరా !

క. భువనాద్భుతదిగ్విజయము
భవదీయబలంబుపేర్మిఁబడసితిఁగలరే
భువినీసాటిప్రధానులు
దివిజేంద్రునిమంత్రివప్ప ! తిమ్మరుసప్పా !

పెద్దన:— సీ. పుట్టినాఁడవుగదా ! భువనప్రసిద్ధిగాఁ
దుళువాన్వయాబ్ధిచంద్రుండ వగుచు

తిమ్మన:— కొట్టినాఁడవుగదా ! కుటిలారిదుర్గసం
ఘంబు భూచక్రంబు కంపిలంగ

ధూర్జటి:— పెట్టినాఁడవుగదా ! విమలహేమాంకిత
మణికిరీటం బాంధ్రమాత తలను

రామలింగము:— కట్టినాఁడవుగదా ! కల్బర్గదుర్గంబు
బహమనీసుల్తానువంశజునకు

భట్టుమూర్తి:-గీ. పట్టినాఁడవుగద! కీర్తివనితకరము
ప్రబలరాజాధిరాజ ! వీరప్రతాప !
మూరురాయరగండ ! దోస్సారశౌండ !
ఆంధ్రభోజేంద్ర ! కృష్ణరాయక్షితీంద్ర !

తిమ్మ:—రాజేంద్రా ! మీకింకేమికావలయునో కోరుకొనుఁడు.

కృష్ణ:—మీరింకను నన్నను గ్రహింపఁదలంతురేని యిట్లగుఁగాక !

## * భరతవాక్యము

చ. పరిణతినొంద ధర్మగతిపాలనసేతురుగాత భూపతుల్
పరమపతివ్రతాత్వమున భాసిలుచుందురుగాత భామినుల్
కెరలి నృపాలగాథల లిఖింతురుగావుత సత్కవీశ్వరుల్
కురియునుగాత దేవతలగోవయి కోర్కులు భూమిదేవియున్.

తిమ్మ:—తథాస్తు.

గద్య:— ఇది శ్రీమత్కౌండిన్యసగోత్ర శిష్టావంశకలశవారాశి రాకా
కైరవ మిత్రపవిత్రచరిత్ర నరసమాంబా సూర్యనారాయణ
శాస్త్రిపుత్ర రాజకుమార్ ఆఫ్ భద్రాచలము శ్రీరాజా
వేంకటనరసింహాప్పరాయ సవాయక్వారావు
బహాదర్ ప్రదత్త కవిభూషణబిరుదాంకిత
వేంకట సుబ్బయ నామధేయ
ప్రణీత తిరుమలదేవి
నాటకము సర్వము

సంపూర్ణము



పట్టాభిరామా ప్రెస్, ఏలూరు.

